# తల్లి - బిడ్డ

శ్రీమతి దరిశి సుభద్రమ్మ



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

ఆదర్శ ప్రచురణ
తొలికూర్పు
1956
ముద్రణ:
టెక్నో కామర్స్
విజయవాడ

రూపాయిన్నర

సంపాదకుడు
గద్దె లింగయ్య

# తొలిపలుకు

నేడు తల్లిమీద అనుక్షణము ఆధారపడుతున్న చంటి పాపలే రేపు తా ముద్భవించిన కుటుంబము, సంఘము, దేశముయొక్క అభ్యుదయమునకు అనేక బాధ్యతలను నిర్వహించే భావిపౌరు లవుతారు. ఇంతేకాదు; సమస్తమానవ జాతి శ్రేయోభివృద్ధికి కావలసిన పరిసరపరిస్థితులు, వివిధ శాస్త్రములు, ఉత్కృష్టభావములు ఇత్యాదులను సృజించే సృష్టికర్త లవుతారు. ఇదెంత మహత్తర పరిణామం !

యిట్టి పరిణామము అనగా - ఇట్టి మానసికశక్తులు కేవలం వంశపారంపర్యంగా అబ్బిన గుణములు కావు. లేదా, ఒక్క బాహ్య పరిసరపరిస్థితులయొక్క సంసర్గంవల్ల చేకూరినవీ కావు. మానవుని సహజలక్షణములైన ఈ మానసిక శక్తులు జననకాలంలోనే శిశువు అంతర్గతములో అంకురప్రాయంగా వున్నవి. ఆనువంశికముగా ఏర్పడుతూవచ్చిన ఈ అంతర్గత మానసికశక్తులు బాహ్య పరిసరపరిస్థితుల సంసర్గ ప్రభావంవలన వికసించును.

మానవసహజశక్తులు, వాని వికాసము మున్నగు విషయములలో అమెరికా, ఐరోపా దేశములందు విజ్ఞానశాస్త్రజ్ఞులు, మనస్తత్వవేత్తలు దాదాపు ఒక వందఏండ్లనుండి పలువిధములైన పరిశోధనలుచేస్తూ వివిధ సిద్ధాంతములను బయలుపెట్టినారు. కాని, రమారమి ఏబది సంవత్సరములుగా, ప్రాన్సస్, బినెట్, ఆర్నాల్టు గెస్సెల్, డాక్టర్ మాంటిసోరి వంటి ఆధునిక మనస్తత్వశాస్త్రజ్ఞులు శిశువు జనించిన మూడు గంటలనుండియే (కొందరు 5 దినములనుండి) శిశుమానసిక

"పరిణామము"ను గురించీ, "పరిమాణము"ను గురించీ ప్రశస్త మైన పరిశీలనలు, ప్రయోగములు చేసినారు. తత్ఫలితంగా పెక్కు నూతనవిషయములు కన్పెట్టినారు. ఈ విషయముల వలన విదితమయ్యే దేమంటే :-

1. అపుడే పుట్టిన బిడ్డలో మానవసహజలక్షణమైన మానసిక జీవిత మున్నది. అనగా ఆనువంశికముగా ఏర్పడుతూ వచ్చిన బుద్ధితత్వము, మనఃప్రవృత్తులు మున్నగు మానసిక శక్తులు అంకురప్రాయంగా వున్నవి.

2. బిడ్డ తనచుట్టూ వున్న ప్రకృతి ప్రసాదితమైన పరిసరములు, కుటుంబము, సంఘముయొక్క పరిసరపరిస్థితులను పరిగ్రహించుకొంటూ తన దేహమును, మానసికశక్తులను పెంపొందించుకొంటుంది. ఇట్టి నిర్మాణ కార్యకలాపమును బిడ్డ అవిచ్ఛిన్నమైన స్వయంకృషిచే స్వేచ్ఛగా సాగించుకొంటుంది.

3. బిడ్డయొక్క సర్వశక్తులు సక్రమ వికాసమొందుటకు శిశువుకు జన్మమిచ్చి, వాత్సల్యంతో పెంచునట్టి తలిదండ్రులు, పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు మున్నగు సన్నిహిత బంధుశ్రేణి వున్నట్టి కుటుంబమే తగిన క్షేత్రము.

4. మానవుడు జననకాలమునుండి 18 ఏండ్ల ఈడు వరకు దైహికంగా పెరుగునట్లే, వాని మానసికశక్తులు సయితము క్రమవికాసమును పొందుతవి. ఈ అభివృద్ధిక్రమములో ప్రధానమైనట్టి మూడు వికాసదశ లున్నవి.

మొదటి దశ :- శిశు జననకాలంనుండి 6 ఏండ్లవరకు.
రెండవ దశ :- 6 నుండి 12 ఏండ్లవరకు.
మూడవదశ :- 12 నుండి 18 ఏండ్లపర్యంతం.

ముఖ్యమైన ఈ మూడు వికాసదశలయందు మానవునిలో దైహికంగానూ, మానసికంగానూ విస్పష్టమైన విభిన్న "పరిణామము" "పరిమాణము"లు గోచరిస్తవి.

5. శిశుజననకాలమునుండి 6 సంవత్సరముల వయస్సువరకున్న శైశవదశ అతి ప్రధానమైనది. శిశువుయొక్క దేహము, బుద్ధిశక్తి, చిత్తప్రవృత్తులు, సామాజికజీవనము సక్రమంగా, సవ్యంగా నిర్మితమయే దశ ఈ మొదటి దశ. ఈ ప్రథమదశలో నిర్మితమైన మన స్తత్వముమీదనే మనుజుని భావిజీవితసౌధము నిర్మితమవుతుంది కాని, ఈ ప్రథమ దశలో మొట్టమొదటి మూడేళ్ళు అత్యంత ప్రధానమైనదశ. ఎందుకంటే ఈ దశలో శిశుమానసికస్థాయి అత్యంత చురుకుగా వుండును. అందుచేత, ఈ 6 ఏండ్లవరకున్న శైశవదశను రెండు ఉపదశలుగా విభజింపబడినది.
మొదటి ఉపదశ :- శిశు జననకాలనుండి 3ఏండ్లపర్యంతము.
రెండవ ఉపదశ :- 3 నుండి 6 ఏండ్లవరకు.

మొదటి ఉపదశలో - మొదటి మూడేండ్లకాలంలో శిశువు తన హృదయాంతర్గత ప్రేరణచే అవ్యక్తచైతన్యంతో బాహ్యాపరిసరములు, పరిస్థితులను పరిగ్రహించు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల పాటవమును సంపాదించుకొంటుంది. క్రమ క్రమంగా మాటలాడటం నేర్చుకొంటూ చక్కని భాషను సాధించుకొంటుంది. బుద్ధి, శక్తుల వికాసమునకూ, సామా

జిక జీవనమునకూ గట్టి పునాది వేసుకొంటుంది. ఈ విధముగా నిర్మితమైన దైహిక, మానసిక శక్తులను క్రమక్రమంగా ప్రయోగించుటమూలకంగా చక్కని నైపుణ్యమును గడించుకొంటుంది. శిశుహృదయాంతర్గతంలో నున్న ఈ అమోఘ శక్తిని "గ్రహణశీల మనస్తత్వము" అని పేర్కొన్నారు. శిశువులోనున్న ఈ అద్భుతశక్తిని కనుగొన్నవారు విశ్వవిఖ్యాతి చెందిన డాక్టర్ మాంటెసోరి. ఈ శక్తి శిశువులో మొదటి మూడేళ్ళు చాల చురుకుగా కృషిచేస్తుంది. తరువాత - రెండవ ఉపదశలో (3 నుండి 6 వరకు) దీని వేగము కొంత సన్నగిల్లుతుంది. అటుతరువాత దీని వేగము మరింత మందగమనమువహించుతూ క్రమేణ చాలవరకు అంతరించిపోతుంది. ఈ విషయములో మరి కొందరు శిశుమనోవిజ్ఞానవేత్తలు పరిశీలనలు జరిపినారు. ముఖ్యంగా ఆర్నాల్డు గెసెల్ అను అమెరికాదేశపు మనోవిజ్ఞానశాస్త్రజ్ఞుడు వేలకొలది శిశువులను పరిశీలించి, "శిశువులో బుద్ధి శక్తి మొదటి రెండేళ్ళు నూటికి 75 వంతులు అత్యంత వేగంగా అభివృద్ధిచెందుతుంది. 2నుండి 5సంవత్సరాలవరకు మందగమనంతో వృద్ధిచెందుతూ, 16 ఏండ్ల వయస్సు వచ్చేటప్పటికి వృద్ధిచెందునట్టి గుణము అంతరించిపోతుంది" అని నిర్ధారించినారు.

ఇందువలన తేలినదేమంటే, ఈ ప్రథమ అవస్థాంతర దశలో - అనగా మొదటి మూడేళ్లు శిశువు దైహికంగా పెరుగుటకూ, ఆనువంశికంగా ఏర్పడుతూ, అంకురప్రాయంగావున్న మానసికశక్తులు సంపూర్ణవికాసము పొందుటకూ అనువగు పరిసరములు, పరిస్థితులు, వాతావరణము

మున్నగువాటిని కల్పించి, శిశువుసల్పు స్వయంకృషికి విజ్ఞాన విచక్షణలతో తోడ్పడునట్టి బాధ్యత, పవిత్రధర్మము ప్రప్రథమమున తల్లి మీదనే అత్యధికంగా వుంటాయి. ఇంతేకాదు. బిడ్డలో అంకురప్రాయముగ నున్న మానసికశక్తులు సక్రమంగా, సవ్యంగా, సర్వతోముఖంగా వికాసమొందుటకుగాని, లేదా అవి కుంటుబడుటకుగాని తల్లియే ప్రథమకారకురాలు అవుతుంది. అందుచేత తల్లి తనబాధ్యతను గుర్తించుట అత్యంత అవసరము. అయితే, తనబిడ్డ అన్నివిధాల అభివృద్ధిచెందవలెనంటే తల్లికి శాస్త్రీయదృక్పథము అవసరం. అనగా-శరీర ధర్మములు, ఆరోగ్యమునుగురించి, శిశు మనోవిజ్ఞానమును గురించి, పరిచయపరిజ్ఞానములు, పరిశీలనాశక్తి ఇత్యాదులను అలవర్చుకొనుట ఎంతైనా అవసరముకదా.

కావున, తల్లులు తమ బిడ్డలయొక్క సమస్త మానసికశక్తుల వికాసమునకు, సామాజిక జీవనము, నైతిక గుణములయొక్క అభివృద్ధికీ, ప్రథమ ఉపదశలో - అనగా - శిశుజననకాలంనుండి 3 ఏండ్లఈడువరకున్న దశలో - దృఢమైన పునాది వేసినచో దేశంలో, సమాజంలో సిరిసంపదలు, శాంతి సౌఖ్యములు పెంపొందుతవి. ఈనాడు నిశ్చింతిగా నిర్విరామంగా ఆడుతూ పాడుతూవున్న పసిపాపలే రేపు దృఢగాత్రులు, సద్గుణాలంకార సంపన్నులు, మహా మేధావులు, కళాప్రపూర్ణులు, విజ్ఞానవేత్తలు, మానవసేవాదురంధరులు అగుట నిక్కము.

శిశుమనోవిజ్ఞానమునుగురించి వున్న పరిజ్ఞానము, అనుభూతులతోనేగాక, గొప్ప మనస్తత్వవేత్తల భావములను

సంగ్రహించుకొని శిశు జననకాలంనుండి 3 ఏండ్ల పర్యంతం వున్న ప్రథమ ఉపదశనుగురించి వ్రాసినాను. మొదట, ఈ పుస్తకములోని విషయములను వ్యాసరూపంలో "ఆంధ్ర మహిళ" అను మాసపత్రికలో వరుసగా దాదాపు రెండు ఏండ్లవరకు ప్రచురించబడినవి. ఇప్పుడు, సోదరులు గద్దే లింగయ్యగారి సలహాననుసరించి ఈ వ్యాసములను పుస్తక రూపంలో ప్రచురించుటకు తగినట్టుగా సవరించినాను. రెండు సంవత్సరముల పర్యంతం వరుసగా నా వ్యాసములను "ఆంధ్ర మహిళ' లో ప్రచురించినందుకు "ఆంధ్రమహిళ" సంపాద కులు శ్రీమతి చెన్న ఘంటమ్మ కృష్ణారావుగారికీ, పుస్తకరూ పంలో రచించమని సలహానిచ్చిన గద్దే లింగయ్యగారికీ నా కృతజ్ఞతాభివందనా లర్పిస్తున్నాను.

ఈ పుస్తకమును భావి భారతపౌరులకు భక్తితో సమర్పిస్తున్నాను.

ఇందులోని విషయములు తల్లులకు ఏమాత్రం సహాక రించిననూ నా కృషి సార్థకమైనదని సంతృప్తి చెందుతాను.

చెన్నపురి

సంక్రాంతి 1956 దరిశి సుభద్రమ్మ

# విషయసూచిక

## ఒకటవ ప్రకరణము



## రెండవ ప్రకరణము



## మూడవ ప్రకరణము

# తల్లి - బిడ్డ

## ఒకటవ ప్రకరణము

### 1 శిశుమానసికజీవితము

"పిల్లలు కేవలం దేహమాత్రులుకారు; పెద్దవారి కున్నట్లే పిల్లలకుకూడా మానసికజీవితమనేది ఉన్నది" అను విషయాన్ని గుర్తించుట అత్యావసరం. పిల్లల శరీరపోషణ విషయంలో మాత్రం శ్రద్ధవహించి వారిని పెంచినంత మాత్రమున తల్లికర్తవ్యం నెరవేరుతుంది అనుకోవడం చాల పొరపాటు. శిశు మనస్తత్వమెరిగి, విజ్ఞాన విచక్షణలతో వారి మానసికాభివృద్ధికి తోడ్పడినప్పుడే తల్లిపవిత్రకర్తవ్యం నెరవేరుతుంది.

పశు, పక్షి, మృగాదులలో సయితం, తల్లి తనపిల్లలను ప్రకృతిసిద్ధమైన మాతృవాత్సల్యముతో ప్రయాసపడి పెంచుతుంది. అనగా, పిల్లలకు జాతిగుణాలు (ఆయా మృగంయొక్క జాతి పరంపరగా వస్తున్న సహజజ్ఞానం) అభివృద్ధిచెంది, ఆహార పానీయాదులను స్వయంగా సంపాదించుకొనే శక్తి వచ్చేవరకు పెంచుతుందన్నమాట. అయితే అంతటితో దాని పని సమాప్తిచెందుతుంది. పిల్లలు కొంతపెరిగి స్వతంత్రముగా జీవించే స్థితికి వచ్చేటప్పటికి తల్లి మృగములోనున్న మాతృవాత్సల్యమూ, చివరకు తనపిల్లలనే జ్ఞానమూ మాయమై

పోతవి. మృగాదులలో శైశవ, బాల్యదశలుకూడా మానవు లతో పోల్చిచూస్తే చాల కొద్దికాలమే. కాబట్టి అవి పెంచ బడే కాలపరిమితికూడ బహు స్వల్పమన్నమాట

మానవుల విషయంలో అలాకాదు. మానవజాతిలో తల్లిప్రేమకూ, మృగజాతి మాతృవాత్సల్యమునకూ చాల వ్యత్యాసముంది. మానవజాతిలో తల్లిప్రేమ సుస్థిరమైనది. జ్ఞానయుక్తమైనది. విస్మృతి అనేదిలేదు. విద్యా, విజ్ఞానాలులేని తల్లి సయితం శిశు శరీరపోషణకేగాక, ఏ కొద్దిగానో, గొప్ప గానో మానసికాభివృద్ధికికూడా పాటుపడుతుంది. మరొక విశేషమేమంటే, మానవజాతిలో శైశవబాల్యదశల కాలపరి మితి అత్యధికం. కారణం, బాల్యచేష్టలద్వారా శిశువుయొక్క మానసికతత్వం అభివృద్ధిచెందటానికి ప్రకృతియే ఏర్పరచిందన్న మాట. తనమీద అనుక్షణం అన్నిటికీ ఆధారపడుతున్న శిశు వుకు తల్లి ఆటలు, మాటలు పాటలు నేర్పుటద్వారా, జ్ఞానేం ద్రియముల వికాసమునకు తోడ్పడుట మూలంగా శిశువు యొక్క మానసికాభివృద్ధికి సహాయపడుతుంది. కాని, ఇంత మాత్రంచేత, తల్లి శాస్త్రీయదృక్పథంవల్ల కలిగిన విజ్ఞాన విచక్షణలతో తోడ్పడినట్లు కాదు గదా! వంశపారంపర్యంగా వస్తున్న అనుభవజ్ఞానంతో మాత్రమే సహాయపడుతుంది. ఇందువల్ల శిశువు మానసికంగా సత్వర అభివృద్ధిగాని, సర్వతో ముఖాభివృద్ధిగానిచెందజాలదు అను విషయం విస్మరించరాదు.

పైగా, కొందరు తమ బిడ్డలను పెంచడానికీ, విద్యా బుద్ధులుగరపటానికీ స్వభావసిద్ధంగా తమకు శక్తివుందని భావి స్తారు. అంతేకాదు. "అమ్మమ్మ అనుభవజ్ఞానము" అందు

బాటులో వున్న దనుకొంటూ ఆత్మసంతృప్తి చెందుతారు. మరి కొందరు, వంశపారంపర్యంగా వస్తూన్న సాంప్రదాయ సంస్కారాల ప్రభావంచేత స్వతస్సిద్ధంగానే తమ బిడ్డలకు మానసిక వికాసం కలుగుతుందంటారు. శాస్త్రవిజ్ఞానంకాని, సుశిక్షణ కాని అనవసరం అని వీరి అభిప్రాయం. ఇలాంటివారి విషయంలో ఒక ఉదాహరణతీసుకొందాం: పిల్లలు ఏ కారణాల చేతనో ఏడ్చినపుడుకాని, ఏదో అసంతృప్తిచేత అల్లరిచేసినపుడుకాని, తల్లి సంతోషంగా ఉన్నట్టయితే, వారిని బుజ్జగిస్తూ ఓదార్చటానికి ప్రయత్నిస్తుంది. కోపతాప సమయాల్లో అయితే మందలించుతుంది; బెదరించుతుంది. తుదకు కొట్టటంకూడ సంభవిస్తుంది. కాని, బిడ్డలయొక్క అసంతృప్తికీ, ఆవేదనకూ అసలు కారణమేమిటో ఆలోచించదు; దేహారుగ్మతకు కారణా లున్నట్టే, మానసిక బాధలకుకూడ కారణాలుంటవి అనే విషయాన్ని గుర్తెరుగదు. శరీరవ్యాధికి నివారణోపాయాన్ని ఎరుగకపోతే ఏవిధంగా దేహంయొక్క అభివృద్ధి అరికట్టబడుతుందో ఆవిధంగానే శిశువుయొక్క మానసికాభివృద్ధి కుంటుబడుతుంది. ఇట్టి తల్లులు తమ బిడ్డల మానసికాభివృద్ధికి తోడ్పడకపోవటమేగాదు, మానసికాభివృద్ధిని కూడ అరికట్టుతున్నా రన్నమాట. కొన్ని సందర్భాలలో కీడును కూడ కలుగజేస్తారు. శిశువుకు అసలు మానసికజీవితం వున్నదనే సత్యాన్నే ఎరుగరు.

ఇందువలన మనకు విదితమయ్యేదేమంటే, ప్రతి తల్లి కూడా సాధ్యమయినంతవరకు తప్పనిసరిగా శిశువుయొక్క మనస్తత్వమెరిగి మానసికాభివృద్ధికి పాటుపడాలి. ఇంతమాత్రం

చేత, "అబ్బో, శాస్త్రవిజ్ఞానం సంపాదించటం ఎవరితరం?" అనుకొంటూ భయపడనవసరంలేదు. ప్రపంచప్రఖ్యాతిని బడసిన మదాము మాంటిసోరి, సూసాన్ ఇసాన్ మున్నగు మనస్తత్వ శాస్త్రజ్ఞులు అన్నట్టుగా, కొంత విద్యావివేకములు గల తల్లి కొంత గ్రంథపఠనంవల్లను, శిశువుయొక్క ప్రవర్తనను పుట్టుకనుండి పరికించి పరిశీలించుటవల్లను అవసరమైన విజ్ఞానం, అనుభవజ్ఞానం పొందవచ్చును. అందువలన ముఖ్యంగా శాస్త్రీయదృక్పథం ఏర్పడుతుందన్నమాట.

## శిశువు మానసికాభివృద్ధికి ఆరోగ్యం అత్యవసరము :—

దేహమునకు, మనస్తత్వమునకు అవినాభావసంబంధమున్నది. ఒక దానిని విడిచి ఒకటి ప్రత్యేకంగా వుండటానికి వీలులేదు. కాబట్టి, సర్వతోముఖమైన మానసికాభివృద్ధికి ఆరోగ్యవంతమైన శరీరం అవసరం. "ఆరోగ్యవంతులగు బిడ్డలు ఆనందమయులు" అను సూక్తిని మరచిపోకూడదు. పిల్లల యొక్క ఆయురారోగ్య భాగ్యములు, భావిజీవితము ప్రప్రథమంలో తల్లి ఆరోగ్యంమీాద, విజ్ఞానవికాసంమీాద ఆధారపడివుంటాయి.

## శిశువు పుట్టకపూర్వం :—

శిశువు పుట్టిన తరువాతనే శిశుపోషణకు ప్రాధాన్యత ఇవ్వాలని అంటారు. అది పొరపాటు. గర్భంలో వున్నప్పుడే ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరం ఏర్పడుతుంది. అంటే, ప్రథమంనుండే గర్భిణీస్త్రీ తన ఆరోగ్యవిషయంలో అధిక

శ్రద్ధవహించుట అత్యవసరం. ఆరోగ్యవంతురాలయిన స్త్రీకి సుఖప్రసవం కలుగుట సహజం. అలా సుఖప్రసవం కలుగుట వల్ల మాతా శిశువుల కిరువురికీ ఎంతో బాధ తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన శిశువు పుడుతుంది.

గర్భిణీస్త్రీ ఆరోగ్యవంతురాలుగా వుండుటకు రెండు ముఖ్యాంశములను గమనించాలి.

1. ఆరోగ్యకర ఆహార విహారాలు.
2. ప్రశాంతమైన మనస్సు.

అనగా, గర్భిణీ స్త్రీ దేహారోగ్యమునకు ప్రాణాధార ద్రవ్యములు (Vitamins)పుష్టికరపదార్థాలు(Nutritious food) గల ఆహారపానీయాలు, పరిశుభ్రమైన పరిసరాలు, విశ్రాంతి విరామములు అత్యవసరముకదా. ఆవిధంగానే అనురాగ ఆదరణలు, ప్రేమపూరిత హృదయం, ప్రశాంత వాతావరణం మున్నగునవి అవసరం. ముఖ్యంగా క్రోధద్వేషాలు, విషాద కరమైన సంఘటనలు, సన్నివేశాలు, భయంకరదృశ్యములు, ఉద్రేకపూరితమైన సందర్భములు చిత్తవికారాన్ని కలుగ చేస్తాయి. "గర్భిణీస్త్రీ సదా సంతోషచిత్తురాలుగా వుండుట అత్యవసరం" అను విషయాన్ని లోకవిఖ్యాతి చెందిన వైద్యశిఖామణులు, మన తత్వశాస్త్రవేత్తలు నొక్కి చెప్పి యున్నారు. ఎందుకంటే, చిత్తవికారంచేత గుండెదడ, నిద్రాభంగం, అజీర్తి, తత్ఫలితంగా అనేక వ్యాధులు సంభవించును. ఫలితం: గర్భిణీస్త్రీశరీరంలో నీరసం ఏర్పడుతుంది.

అనగా, "మనోదౌర్బల్యంచేత దేహదౌర్బల్యం" ఏర్పడుతుంది. ఇట్టి బలహీనతవల్ల, గర్భిణీస్త్రీకే గాక శిశువునకు కూడ హాని సంభవిస్తుంది.

శిశువు గర్భంలోవున్నంతకాలం తల్లియొక్క అనారోగ్యంనుండి సాధ్యమైనంత రక్షణ ఇవ్వటానికి ప్రకృతి ఎంతో ప్రయత్నిస్తుంది గాని, తల్లియొక్క బలహీనత వలన "సుఖ ప్రసవం" కలుగుట మాత్రం కడు దుర్లభం. తల్లి గంటల కొలదీ గాక దినముల తరబడీ ప్రసవ వేదన అనుభవించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. లేదా, నవమాసములు నిండకమునుపే "అకాల ప్రసవం" కలుగుతుంది. ఈ రెండు సందర్భాలలో ఏ వొక్కటి సంభవించినా తల్లిమాత్రమేగాక శిశువుకూడ దుర్భరబాధల్ని అనుభవించవలసివస్తుంది.

సుఖప్రసవం కలిగే సందర్భంలో సయితం శిశువు దుస్సహ బాధల్ని అనుభవించుతుంది. తల్లిగర్భంనుండి శిశువు కడు ఇరుకైన ద్వారంగుండా, దేహాన్నంతా ముడుచుకొని ప్రయాణంచేయాలి. ఒక వైపేమో లాగినట్లు, మరొక వైపు నెట్టినట్లు రాచుకొంటూ, గంటలకొలది ఎంతో అవస్థ పడుతూ ప్రయాణంచేసి బయటపడుతుంది. తల్లి బలహీనురాలైతే "ఈ ప్రసవ ప్రయాణం" గంటలేగాక దినాలదాకా సాగవచ్చును. అలాంటప్పుడు తల్లిపడే బాధలేగాక శిశువుయొక్క బాధలుకూడ అగమ్యగోచరమన్నమాట. ఒకొక్కప్పుడు శిశువుకు ఈ దుర్ఘటమైన ప్రయాణమార్గమధ్యంలోనే ప్రాణాలు కోలుపోయే స్థితి ఏర్పడవచ్చును. ఇందువల్ల తల్లికికూడా ప్రాణాపాయం సంభవించవచ్చును. ఒక

వేళ బ్రతికి బయటపడ్డప్పటికీ శిశువు అతి నీరసంగా వుంటుంది. అయితే తల్లి పడే ప్రసవవేదన మాత్రం మనకు గోచరిస్తుంది; గాని శిశువు పడే బాధలను అవగాహనం చేసుకోలేము.

వివిధ శాస్త్రముల అభివృద్ధి పరుగులిడుతూన్న ఈ నవ నాగరిక కాలంలో కూడ మాతా శిశువు లనుభవించే ఈ దుర్భర బాధలను తొలగించే మార్గం కనిపెట్టకపోవటం అతి విచిత్రమైన విషయం.

అయితే అమెరికాలో, ఐరోపాదేశాలలో తల్లి ప్రసవ వేదన అధికంగా అనుభవించకనే ప్రసవించులాగునచేసే పద్ధతి నొకదానిని కనిపెట్టారు. కాని మనదేశంలోకి ఇంకనూరాలేదు. మధ్యయుగంనాటి ఆచారవ్యవహారాలు, అజ్ఞానం, అవిద్య ఇంకనూ అంతమొందలేదు. అందువల్లనే విద్యా విజ్ఞానాల్లో ఏవిధంగా మనదేశం వెనకబడివున్నదో అదేరీతిగా ప్రసూతి పద్ధతిలోకూడా వెనకబడివున్నది.

అయితే, శిశువు పుట్టేటప్పుడు గాని, తదనంతరంగాని పడే బాధల్ని నివారించే విధానాన్ని మాత్రం నవనాగరికతకు ప్రసిద్ధిచెందిన పశ్చిమదేశాల్లోకూడా కనిపెట్టలేదు. డాక్టర్ మాంటిసోరి కూడ ఈ విషయంలో తన విచారాన్ని ఇలా వ్యక్తపరిచింది. "ఈ దుర్ఘటమైన మార్గాన్ని (తల్లి గర్భం నుండి) శిశువు సునాయాసంగా ప్రయాణంచేయటానికి వీలగు నట్లుగాని, పుట్టిన తరువాత శిశువు పడు బాధల్ని తొలగించే మార్గాన్నికాని కనిపెట్టినట్టు మానవ నాగరిక చరిత్రలోనే కనబడటంలేదు."

శిశువు పుట్టినతరువాత :—

శిశువు తల్లి గర్భంనుండి బాహ్యప్రపంచానికి రావడం అనేది అత్యంత దుర్ఘటమైన కార్యం. బయటపడిన వెంటనే మరి కొన్ని బాధలను అనుభవించుట సంభవిస్తుంది. శిశువు తల్లిగర్భంలో ఇంతవరకూ ద్రవపదార్థంలో నిరపాయంగా పెరుగుతూ, ఒకే విధమైన వాతావరణంలో సుఖంగా వుంటూ వచ్చింది. శీతం, ఉష్ణం, చీకటి, వెలుతురు మొదలైన పరస్పర విరుద్ధమైన మార్పులు లేవు. కఠోరమైన శబ్దములు లేవు. కాళ్లు చేతులు కొద్దిగా ఆడించటం తప్ప మరేవిధమైన పనీ లేదు. చివరకు ఊపిరి పీల్చి విడిచే కార్యంకూడ శిశువుకుగాను తల్లియే చేసేది. శబ్దాలు మొదలైన వాని ఫలితంగా ఏవో కొన్ని స్పందనాలు (Vibrations) మాత్రం అప్పుడప్పుడు తగిలేవి కాని, మరేవిధమైన చలనములువుండేవి కావు. అంచేత శిశువు తల్లిగర్భంలో విశ్రాంతిగా ఉండేది. కాని బాహ్యప్రపంచంలో ప్రవేశించగానే హఠాత్తుగా చల్లని గాలి దాని ఊపిరితిత్తుల్లోకి పోయి బయటికి వస్తుంది. మొట్ట మొదటి ఈ కార్యం శిశువుకు చాల బాధాకరంగా వుంటుంది. అంచేతనే కెవ్వున కేకవేయుట సంభవిస్తుంది. తల్లిగర్భంలో వున్నప్పుడు ద్రవపదార్థంలో నిరపాయంగా చీకట్లోవున్న శిశువు బాహ్యప్రపంచంలోకి రాగానే, కండ్లను మిరుమిట్లు గొలిపే వెలుతురు, దేహాన్నంతా వణికించివేసే చల్లనిగాలి కర్ణకఠోరమైన శబ్దాలు, దేహంలో ఏవో వింత కదలికలు, మొదలగునవి శిశువుకు ఎంతో బాధాకరంగా వుంటవి. ఇలాంటి పరస్పర విరుద్ధమైన వాతావరణానికి అలవడేదాక

శిశువు ఏదో తెలియని బాధ అనుభవిస్తుంది. ఎంతో అలసి పోతుంది. కాని, శిశువు పడేబాధల్నిగాని, అలసటనుగాని పెద్దవాళ్లు గ్రహించుటలేదు. అంచేతనే తల్లికి చేసినంత శ్రద్ధగా శిశువుకు పరిచర్యలు చేయుటలేదు.

శిశువుకు పరిచర్యలు చేయకపోవటమేగాదు, చక్కని శిక్షణనుపొందిన మంత్రసానులు, ఒక్కొక్కప్పుడు డాక్టర్లు కూడా పసిగందును ఎంతో మోటుతనంతో ఎత్తుతారు; పట్టుకుంటారు; కడుగుతారు. స్వేచ్ఛగా కాళ్లు చేతులు ఆడించటానికి అడ్డుతగిలేలాగు బట్టతో చుట్టిపెడతారు, లేదా, చొక్కాతొడుగుతారు, ఇవి బిడ్డకు మొట్టమొదటి సంకెళ్ళు అన్నమాట. శిశువువిషయంలో ఎంత మోటు తనంగా ప్రవర్తిస్తారో అంత బాధను కలుగజేస్తున్నారనే విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి.

శిశువు తల్లిగర్భంనుండి ప్రయాణంచేసేటప్పుడూ, బయటికివచ్చిన తదనంతరం భరించరాని బాధల్నిపడుతుంది. అందువల్ల అది అలసిపోయి నీరసంగావుంటుంది. కాబట్టి వెను వెంటనే శిశువుకు విశ్రాంతి కలుగజేయుట అత్యవసరం.

శిశువు బాహ్య ప్రపంచ పరిస్థితులకు, వాతావరణము నకు క్రమక్రమముగా అలవడేవరకూ సాధ్యమైనన్ని సౌక ర్యాలను చేయాలి. శిశువును మెత్తని బట్టలమీద పడుకో బెట్టాలి; దుస్తులు వేయకుండా అతి సన్ననిబట్ట కప్పితే చాలు. గదిలోకి చల్లనిగాలి ప్రవేశించకుండా చూచుకోవాలి. కాని, పరిశుభ్రమైన గాలి రాకుండ కిటికీలను మూసివేయకూడదు.

వెలుతురు కండ్లమీద పడకుండ శిశువు పడుకొన్నచోటు మాత్రం చీకటిగా వుంచాలి. పాలిచ్చేటప్పుడు తల్లి అతి సున్నితంగా ఎత్తుకోవాలి. అతి జాగరూకతతో, వీలయినంతవరకు శిశువును అలసట తీర్చి, సుఖనిద్ర పొందేలాగున చేయుట అవసరం.

## 2 శిశు ప్రవర్తన

శిశువు మాట్లాడటం నేర్చుకొన్నప్పటినుండే దాని మానసికజీవితం ప్రారంభమవుతుందనీ, అందాక అంటే శిశువుకు మొదటి సంవత్సరం నిండేదాక దాని దేహపోషణను మాత్రం గమనిస్తే చాలుననీ అనేకులు అనుకుంటారు. కాని, అది చాల పొరబాటు. అట్టి అభిప్రాయం అసలు అనుభవజ్ఞానానికే వ్యతిరేకం. ఇక శాస్త్ర విజ్ఞానాన్ని బట్టి చూస్తే ఎంత వ్యతిరేకమో మరి చెప్పనవసరంలేదు. ఆదిలోనే అన్నట్టుగా, దేహానికీ మానసికతత్వానికీ అవినాభావ సంబంధ ముంది. ఒకదాని విడిచి మరొకటి ఉండటానికి వీలులేదు. బిడ్డ దేహముతోపాటే, మానసికజీవితంకూడ అభివృద్ధిచెందుతుంది. కాబట్టి, తల్లి, దేహపోషణ కెంత గమనమిచ్చి బిడ్డను పెంచుతుందో, అంత లక్ష్యమును బిడ్డయొక్క మానసినకాభివృద్ధికిచ్చి తోడ్పడుట అత్యవసరం అన్నమాట. బిడ్డపుట్టిననాటినుండే విద్యాభ్యాసం ప్రారంభమవుతుందనే విషయాన్ని తల్లి పదే పదే గుర్తుకు తెచ్చుకోవాలి. "విద్యాభ్యాసం" "శిక్షణ" అనగానే, బిడ్డకు బోధించుట, దాన్ని తర్ఫీదు చేయుట అని అర్థంకాదు. బిడ్డలో అంకురప్రాయంగాఉండే మానసిక తత్వవికాసానికి తోడ్పటం అని గ్రహించాలి.

మొదట బిడ్డపుట్టుకనుండి మూడు సంవత్సరముల దాక దాని మానసిక జీవిత పరిణామమును గురించి వీలయినంత విపులంగా పరిశీలించుదాము. అనగా, ప్రప్రథమంలో బిడ్డ యొక్క ప్రవర్తనల ద్వారా (Behaviour) స్వతసిద్ధమైన లక్షణాలు, (Instincts), ప్రేరణలు (Impulses), వాంఛలు (Desires), క్రమేపి ఇష్టా యిష్టాలు, కోప-తాపాలు, సుఖ-దుఃఖాలు, అనురాగం మొదలగు భావోద్రేకములు (Emotions) వ్యక్తమవుతుంటాయి. అదేవిధంగా, క్రమ క్రమముగా దేశ కాల వ్యత్యాసాలు (స్థలం, కాలం), పరిసరాలలో, పదార్థాలలో వ్యత్యాసాలు మొదలగువానిని పరికించటం, పోల్చిచూడటం, నిర్ణయించు కోవటం మొదలగు బుద్ధికి సంబంధించిన అంశములు సయితం వ్యక్తమవుతుంటాయి. కాబట్టి, తల్లి బిడ్డయొక్క మానసికాభివృద్ధిక్రమంలో, ప్రతిస్థితిలో ఏవిధంగా తోడ్పడుట అవసరం అనే విషయాన్నికూడా ఆలోచించుదాం.

**బిడ్డ మొదటి అనుభవం:—**

బిడ్డ తల్లి గర్భంలోనుంచి బహిః ప్రపంచానికి "ప్రసూతి ప్రయాణం" చేసినపుడు, పుట్టినపిదప కొంత అనుభవాన్ని పొందుతుంది. అనగా, శిశువు తల్లి గర్భంలో శాంతంగా, సుఖంగా పెరిగింది; పుట్టినతరువాత బాహ్యప్రపంచంలోని పరస్పరవిరుద్ధమైన శీతోష్ణస్థితులు, శబ్దములు, వెలుతురు మొదలగునవిగల వాతావరణమునకు అలవడేదాక అనేక బాధలను అనుభవించుతుంది.

బిడ్డ ప్రారంభదశలో:—

పుట్టిన శిశువుకు కొన్ని చలనాలు (Movements) మాత్రమే వుంటవి. అవి అస్పష్టంగా వుంటాయి. శిశువు తన బాధలను, వాంఛలను ఏడ్పుమూలకంగా వ్యక్తపరుస్తుంది. పాలు త్రాగటానికి శిశువు పెదిమలు కదులుతుంటాయి. ముక్కు-రంధ్రాలు కందుతవి; ఏడ్చేటప్పుడు గొంతుక, గుండె వేగంగా చలించటం గోచరిస్తుంది. మొదట బిడ్డ పాలు త్రాగటం కోసం కలిగే కదలిక మాత్రమే స్పష్టంగా గోచరిస్తుంది. కాని, తక్కినవి అంత స్పష్టంగా కనిపించవు. అసలు అవి ఇంకనూ శిశువుకు స్వాధీనంలో వుండవు. అందువల్ల నే, బిడ్డను ఏవిధంగా ఎత్తుకొన్ననుసరే, పడుకోబెట్టినను సరే, అదేవిధంగా వుండిపోతుంది; కాని ఎదిరించజాలదు. అయితే అంత అసహాయస్థితిలోకూడ శిశువులో ఒక విశేష గుణం గోచరిస్తుంది. బిడ్డచేతిలో ఏ చిన్నవస్తువును పెట్టినను (చేతిలో ఇమిడే వస్తువు) దాన్ని గట్టిగా పట్టుకొంటుంది. ఇది మానవజాతికి చెందిన "ప్రత్యేక లక్షణం" ఉత్తరోత్తర ఈ విషయాన్ని వీలయినచోట విపులంగా వివరించటానికి ప్రయత్నిస్తాను.

బిడ్డపుట్టిన రెండుమూడు దినములలోనే, బుగ్గలకు తల్లి పాలిండ్లు తాకినపుడుగాని, పాలవాసన గ్రహించగలిగినంత దగ్గరగా తల్లి వుంటేగాని బిడ్డ స్వతస్సిద్ధంగానే స్తన్యమును నోటితో తడుముకొని అందుకుంటుంది; పుట్టిన కొన్ని రోజులలోనే దీపం దగ్గరగా తీసుకుపోతే, శిశువు తలత్రిప్పి

చూడటానికి ప్రయత్నిస్తుంది. కాని వెలుతురు చూడజాలదు. దీనివల్ల తెల్లమయ్యేదేమంటే:- స్పర్శ, వాసన, దృష్టికి సంబంధించిన జ్ఞానేంద్రియములు అభివృద్ధి చెందుటకు ప్రారంభమయినవని తేటపడుతుంది. అయితే దూరాన్ని గ్రహించే జ్ఞానం మాత్రముండదు. అందుచేతనే, బిడ్డ తన చేతిబొటనవ్రేలిని నోటిలో పెట్టుకోటానికిగాని, మెరిసేవస్తువును అందుకోటానికిగాని చాలకాలం పట్టుతుంది.

శిశువు స్వయంగా కదలజాలదు; జరుగజాలదు. దాని చేతులు వాటంతట అవి కదలుటయేగాని, ఇచ్ఛాపూర్వకంగా కదల్చటం కాదు. రెండుకళ్ళతో ఒకే వస్తువుపై దృష్టిని కేంద్రీకరించజాలదు. ఒకకన్ను ఒకవైపు మరొకకన్ను మరొకవైపు చూస్తున్నట్టు వుంటుంది.

బిడ్డకు ఒకనెల నిండేటప్పటికి అది ఎంతో అభివృద్ధి చెందుతుంది! బిడ్డకు క్రమక్రమంగా కొన్ని స్పష్టమైన కదలికలు, ప్రవర్తనలు (Behaviour) ఏర్పడుతవి. బిడ్డ పాలనుచక్కగా త్రాగగలదు. కొంతవరకు రెండుకళ్ళతో దృష్టిని కేంద్రీకరింపగలదు. కాని ఒక ఏడాదివరకు భీతి కలిగినప్పుడుమాత్రం రెండు కళ్ళతో దృష్టిని నిలువజాలదు. అందుకే బిడ్డకు మెల్లవుందని భ్రమపడుతుంటారు. క్రమేపి, కాళ్ళుచేతులను చక్కగాఆడించటానికి అభ్యసించుతుంది. శరీరంలోనికండరములను (Muscles) స్వాధీనంచేసుకోటం నేర్చుకుంటుంది. ఇంతకుముందు అప్రయత్నంగా ఆడించుతున్న కాళ్ళు చేతులను ఐచ్ఛికంగా కదలించటానికి ప్రయత్నిస్తుంది.

బిడ్డ కాళ్ళు, చేతులను ఆడించేటప్పుడు హఠాత్తుగా ఊయలపలకగాని, మరేదైనాగాని చేతికి తగిలి నొప్పి కలిగితే, దృష్టిని మళ్ళించి చూడటానికికూడ యత్నిస్తుంది. (నొప్పిని కలిగించినది ఏదా అన్నట్లుగా) ఈలాంటప్పుడే బిడ్డను, "చేతికి చోటుకూ నడుమ నుండే ఎడము" గ్రహించటం ప్రారంభ మవుతుంది. కాని బిడ్డ నడవటానికి ప్రారంభించినపుడే విశాల మైన స్థలాన్ని, దూరాన్ని గ్రహించేశక్తి కలుగుతుంది.

రెండుమూడు నెలలమధ్య, బిడ్డ తన అందుబాటులోని వస్తువులను పట్టుకోటానికి ప్రయత్నిస్తుంది. క్రమక్రమంగా ఒక సంవత్సరం నిండేలోపల, దూరంగావున్న వస్తువులను అందుకోటానికి నేర్చుకొంటుంది. 18 నెలల లోపల, ఎవరికీ అందుబాటులోలేని, స్పృశించటానికి కూడా సాధ్యముకాని వస్తువులను పట్టుకోటానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది. ఉదాహరణగా చంద్రునిపట్టుకోడానికి, అద్దంలోని ప్రతిబింబాన్ని పట్టుకుని ముద్దుపెట్టుకోటానికి ప్రయత్నిస్తుంది.

బిడ్డ పుట్టిన రెండు మూడు నెలలలోపల జ్ఞానేంద్రియములు ఏ విధంగా ఎంత అభివృద్ధి చెందుతవో చూద్దాము.

స్పర్శేంద్రియము, దీనికి సన్నిహితంగావున్న ఘ్రాణేంద్రియ జిహ్వేంద్రియాలు [అనగా తాకుడు, వాసన, రుచి]

శిశువుకు మొట్టమొదట పటుపడేది స్పర్శేంద్రియ జ్ఞానము. ఇది శిశువు గర్భంలో వున్నప్పుడే అభివృద్ధి చెందనారంభించును; పుట్టిన తరువాత మొదట తల్లినిగాని, పాలిండ్లనుగాని చూడజాలని స్థితిలోనే, స్పర్శచేత తల్లిపాలిండ్లను తడుముకొని పాలు త్రాగుతుంది. తల్లి చేతులలో, తొడల

మీద ఆప్యాయంగా పడుకొంటుంది. ఈ స్పర్శేంద్రియ మునకు సన్నిహితంగావుండేవి ఘ్రాణేంద్రియము, జిహ్వేం ద్రియము [అనగా, వాసన చూసే శక్తి, రుచి చూసే శక్తి] ఉదాహరణం:—బిడ్డ పుట్టిన రోజే తల్లిపాలిండ్లకు కిరసను నూనె కానీ లేక ఘాటైనవాసనవచ్చే మరేదైనాగానీ, పూసినట్టయితే, బిడ్డ తల త్రిప్పివేస్తుంది. బిడ్డ పుట్టిన రెండు మూడు వారములకే ఘాటైన మందులను త్రాగదు. తల్లి పాలు వాసనవస్తే వెంటనే పాలిండ్లవైపుకు తలను త్రిప్పు తుంది. తల్లిదేహంయొక్క వాసన బిడ్డకు చాల ఆప్యా యంగా వుంటుంది.

## శ్రవణేంద్రియజ్ఞానం (వినేశక్తి):—

శిశువుకు చాలకాలందాక చెవులు స్పష్టంగా వినబడవు. పుట్టిన మొదటిరోజులలో కఠోర శబ్దాలు వినవచ్చినమా గందరగోళంగా వుంటాయి. అందువల్లనే బిడ్డ భయంతో ముఖాన్నీ, దేహాన్నీ ముడుచుకొంటుంది. కాని, ఆలకించే శక్తిమాత్రం ఆలస్యంగా అభివృద్ధిచెందుతుంది. దాదాపు నెలన్నరనుండి రెండునెలలలోపల కొంత మృదువైన శబ్దా లను వినుటకు బిడ్డ తన తలను త్రిప్పటం ప్రారంభించుతుంది. రెండు మూడు నెలల లోపల క్రమ క్రమంగా ప్రతిదినమూ వింటున్న పరిచయ శబ్దాల్ని పాటించి వింటుంది. అనగా, తల్లికంఠధ్వని, స్నానంచేయించేటప్పుడు కలిగే సందడి మొదలగువానిని ఆలకించటం ప్రారంభిస్తుందన్నమాట. బిగ్గరగా మాట్లాడటం, కీచుగొంతులు, కిఱ్ఱుమను తలుపుల

చప్పుడు మొదలయిన కఠోరశబ్దాలమధ్య పెరిగే బిడ్డలకు సాధారణంగా నరములకు సంబంధించిన వ్యాధులు సంభవిస్తాయి. సున్నితమైన శబ్దములు, మృదుమధురమైన కంఠధ్వనితో పాడే పాటలు మొదలగునవి వున్న ప్రశాంతమైన వాతావరణాలో పెరిగిన బిడ్డలకు ఈ వ్యాధులు రావు. వారి ఆరోగ్యం చక్కగా పెంపొందుతుంది.

నైపుణ్యం :—

బిడ్డ నాలుగునెలల ఈడుకే తన అవయవములనూ, దేహాన్నీ స్వాధీనంచేసుకోటానికి, వాని నుపయోగించుటలో నేర్పునూ అభ్యసించుతుంది. బిడ్డ తలను ఒకవైపుకు త్రిప్పితే నిరోధించి తన ఇష్టానుసారంగా త్రిప్పుతుంది. మూడవనెల నుండే బోరగిలపడడానికి ప్రయత్నిస్తుంది. నాలుగోనెలలో బోరగిలపడుతూ, తలను ఎత్తటానికీ, దోగాడటానికీ, వెల్లకిలపడుకోటానికీ, మరిమరి బోరగిలపడటానికీ పదేపదే అభ్యసించుతుంది. తల్లి తొడలమీదకాని, నేలమీదకాని — కాళ్ల వెనక ఆధారమేదైనా వుంటే— వెనుకకు నెట్టుతూ, నెట్టుతూ, చిట్టచివరకు కూర్చోటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. తన ముందున్న వస్తువులను పట్టుకోడానికి వాటిమీద తన అరచేతిని వేస్తుంది. కాని వ్రేళ్లతో పట్టుకోవటం మాత్రం ఇంకనూ తెలియదు. క్రమేపి వ్రేళ్లతో పట్టుకోటానికి నేర్చుకొంటుంది. ఈ ఈడులో చేతిని చక్కగా నోటిలో పెట్టుకోగలదు. బిడ్డ నాలుగు నెలల వయస్సులోనే పైన ఎగిరే పక్షులను, అల్లలాడే ఆకులను, చెట్లను వీక్షించుతుంది. పెద్దవాళ్లు మాట్లాడినప్పుడు వారి పెదవులనే వీక్షించుతుంది.

తల్లినిచూచి నవ్వటం, నోటితో వింతవింత శబ్దాలుచేయటం, కూయటం ప్రారంభిస్తుంది. అలాగు శబ్దాలుచేసినపుడు తల్లిముఖంలో వ్యక్తమయ్యే ఆనందాన్నిగుర్తించుతుంది. అంచేతనే, అనేకసార్లావలించుతూ, తల్లిని సంతోషపెట్ట టానికి ప్రయత్నిస్తుంది.

బిడ్డకు తొమ్మిది నెలల వయస్సు వచ్చేటప్పటికి చాల వరకు అవయువాలు స్వాధీనమయిపోతవి. జ్ఞానేంద్రియము లను ఉపయోగించేనేర్పు పట్టుపడుతుంది. అప్పుడే, కొంత కాలంగా బిడ్డ స్వయంగా కూర్చోవటం నేర్చుకుంటుంది. స్వయంగా నిలబడటానికి అభ్యసించుతుంది. అవసరమై నపుడు మాత్రమే కొంత సహాయం తీసుకొని నిలబడుతుంది. అడుగుమీద అడుగుపెట్టి నడవటం నేర్చుకొంటుంది. వస్తు వులను చేతివ్రేళ్ళతో పట్టుకొంటుంది. పెద్దవాళ్ళను అనుకరిం చుతూ పెన్సిలును వ్రేళ్ళతోపట్టుకొని గీతలుగీయటం కూడా చేస్తుంటుంది. అమ్మ, అత్త, నాన్న మొదలగుమాటలను ఉచ్ఛరించటానికి ప్రారంభించుతుంది. ఒక సంవత్సరం పూర్తిగా నిండకముందే మరికొన్నిమాటలను నేర్చుకొం టుంది. తన కిష్టంవచ్చినవైపుకు చాలదూరందాక ప్రాకు తుంది. తన చిన్నమంచాన్ని, మెట్లనూ ఎక్కటానికీ, ఎట్టి సహాయం లేకుండా నడవటానికీ నేర్చుకొంటుంది. బిడ్డ ఆట వస్తువులను వ్రేళ్ళతో చక్కగా పట్టుకొని బుట్టలోవేయ గలదు. తేలికగావుండే చెక్క ఇటికలాంటి ఆటవస్తువులను, ఒక ఇటికమీద రెండవదానిని పెట్టటంకూడ నేర్చుకొంటుంది. అంతకన్నాఎక్కువగా పెట్టజాలదు.

ఆటలు - మాటలు :—

బిడ్డకు ఒకసంవత్సరం పూర్తిఅయ్యేరోజులలో అనేక ఆటలు—మాటలలో నేర్పును సంపాదిస్తుంది. క్రొత్తక్రొత్త ఆటలను, మాటలను, పనులను నేర్చుకోవటంఅంటే అతి ఇష్టం. ఏ క్రొత్తప్రయత్నంలోకాని జయించినప్పుడు బిడ్డ ఆనందానికి అంతంలేదు.

ఉదా:—రెండు చెక్క ఇటికలమీద మూడవదాన్ని పడకుండా పెట్టడానికి ఎంతో ప్రయాసపడుతూ చివరకు నేర్చుకొంటుంది. అది పడకపోతే తనప్రయత్నం ఫలించింది కదా అని గంతులువేస్తూ సంతోషిస్తుంది.

తన చుట్టూ పెద్ద పిల్లలు పరుగెత్తటం, ఆడటం, గంతులువేయటం మొదలగువానిని అతి ఆసక్తితో పరికించు తుంది. అనేక క్రొత్తపనులను చేయటానికి నేర్చుకొనే టప్పుడు, బిడ్డ ఎన్నిసార్లో తప్పిపోతూ, క్రింద పడుతూ, లేస్తూ, చిట్టచివరకు జయించితీరుతుంది. పళ్లెమునో, చెంబునో, (మరి దేనినైనా) దేనితోనైనా కొట్టి శబ్దం చేస్తూ, ఆ శబ్దాన్ని అనుకరించటానికి ప్రయత్నించుతుంది. బిడ్డకు, చుట్టూవున్న ప్రదేశాన్నీ, పదార్థాల్నీ పరికించటం, మనుష్యులను, వస్తువులను గుర్తించటం చాల యిష్టం. వస్తువులను దాని స్థానమునుండి బయటకుతీసి, క్రిందపడవేయటం, పగలగొట్టటం, పరిశీలించటం అంటే ఎంతో సరదా. మంటను, దీపాన్నీ వీక్షించటం చాల ఇష్టం. బిడ్డ తనకు అందుబాటులో లేని వస్తువులను అందుకోటానికి ప్రయత్నించు తుంది. ఈ విధంగా బిడ్డ తన దేహాన్నీ, అవయవాలనూ

పూర్తిగా స్వాధీనంచేసుకోటానికీ, ఉద్దేశపూర్వకంగా ఉప యోగించటానికీ నేర్చుకుంటుంది. జ్ఞానేంద్రియములద్వారా అనేక విషయాల్ని గ్రహించటానికి ప్రారంభిస్తుంది.

బిడ్డ, తాను కేకలువేయటంవల్ల తల్లి తనవద్దకు వస్తుం దనే విషయాన్ని గ్రహించుకొంటుంది తన వచ్చీరాని మాటల వలన తల్లి సంతోషించటం గుర్తించుతుంది. తాను చేసే శబ్దాలవల్ల తనకు లభించే సహవాసం, సహాయములను గుర్తించుతుంది. (మానవుడు సంఘజీవి అనే తథ్యాన్ని ఉత్త రోత్తర గుర్తించటానికి మొట్టమొదటిమెట్టు అన్నమాట). క్రమేపి ఒకవిధమైన శబ్దాన్ని, దానికి సంబంధించిన ఫలి తాన్ని గ్రహించటం ప్రారంభమవుతుంది.

ఉదా:—కోపంతో మాట్లాడటానికీ సంతోషంతో మాట్లాడటానికీ వున్న తేడాను చక్కగా గ్రహించుతుంది. కోపంతో ముడుచుకుపోయినముఖానికీ సంతోషంతో విప్పారినముఖానికీ వున్న వ్యత్యాసాన్ని గుర్తిస్తుంది. తన వాంఛను, ఇష్టాన్ని వ్యక్తపరచే కంఠధ్వనినీ, శబ్దాలనూ ఉప యోగించటం నేర్చుకొంటుంది.

ఈ తరుణంలోనే బిడ్డ సరియైన మాటలను నేర్చుకోవటం ప్రారంభించుతుంది. అడుగులచప్పుడు ఆలకించటం, వచ్చే వారెవరో గుర్తించటం, పరిచితుల ముఖాల్ని చూచి నవ్వటం, అపరిచితులను వింతగా చూడటం, మొదలైనవి చేస్తూవుం టుంది. వీటి ద్వారా బిడ్డయొక్క మానసికతత్వం శరీరంతో పాటే దినదినాభివృద్ధి చెందుతుంది అనే విషయం స్పష్ట పడుతుంది.

## 4 శిశు - ఆంతర్యజీవితము

ఇంతవరకు బిడ్డ సహజప్రవర్తనలనుగురించి కొంత పరిశీలించినాము. యిక బిడ్డయొక్క ఆంతర్యజీవితమును, దాని క్రమపరిణామమునూ కొంత విపులంగా పరిశీలిస్తూ, ఏవిధంగా తల్లి విజ్ఞాన-విచక్షణలతో బిడ్డయొక్క మానసికాభివృద్ధికి తోడ్పడుట అవసరమో ఆలోచింతము.

చంటిబిడ్డ :—

శిశువు పుట్టినప్పుడు దాని మానసికజీవితం తల్లిలో లీనమైవుంటుంది; కాని బాహ్యప్రపంచానికి సంబంధించి వుండదు. మొట్టమొదట తన ఆకలిబాధను తీర్చి తృప్తిని కలుగజేస్తున్న తల్లి పాలిండ్లుమాత్రమే బిడ్డకు పరిచయము. కాని, తల్లి అనే ఒకవ్యక్తి వుందనే జ్ఞానమే వుండదు. తనకు సంతృప్తిని కలుగజేసే స్తన్యము, విరామ సౌఖ్యాల నిచ్చే అంకపాళి (తొడలు) తల్లి లాలనపాలనలు మొదలయినవి తల్లి అనే ఒకవ్యక్తికి సంబంధించినవనేవిషయం బిడ్డకు ఎఱుకలేదు.

అయితే బిడ్డయొక్క జ్ఞానేంద్రియములు, అవయవములు అభివృద్ధిచెందేవరకు బిడ్డ మానసికజీవితం అభివృద్ధిచెందక అట్టే వేచియుండదు. బిడ్డ మానసికజీవిత మనేది మొదట తన ఆకలినితీర్చే తల్లి పాలిండ్లమీద, తనకు ఆహ్లాదము కలుగజేసే అంకపాళిమీద (తొడలమీద) కేంద్రీకరింపబడి వుంటుంది. స్పష్టంగా చూడటానికీ, వినటానికీ, ఇష్టప్రకారం కాళ్ళు, చేతులు కదిలించటానికి చేతకానపుడే బిడ్డకు నోటిమూలకంగా 'స్పర్శించి గ్రహించేశక్తి' అభివృద్ధి చెందుతుంది.

బిడ్డయొక్క శరీరం శైశవావస్థలో వున్నట్టే, దాని మానసికతత్వంకూడ శైశవావస్థలో వున్నదన్నమాట. బిడ్డ తన శరీరపోషణకు అవసరమైన పాలను, నీళ్ళను నోటిగుండా పరిగ్రహించినట్టే తన మానసికతత్వాభివృద్ధికి మొట్టమొదట నోటిమూలకంగానే బాహ్యప్రపంచ పరిజ్ఞానమును గ్రహించుతుంది. అనగా శిశు శారీరకాభివృద్ధికీ మానసికాభివృద్ధికీ 'నోరే' ప్రధాన సాధనమనీ, సూక్ష్మతరమైన జ్ఞానేంద్రియమనీ విదితమవుతుంది. బిడ్డను ప్రారంభదశలో కేవలం తిండితింటూ తృప్తిపొందే ఒకజీవితో పోల్చవచ్చును. అంచేత అది శారీరకంగానైతేనేమి మానసికంగానైతేనేమి చంటిబిడ్డయే.

## శిశువు, మానసికజీవితం :—

ఇంతేగాదు, బిడ్డ ఇష్టాయిష్టాలుసయితం దాని నోటిమూలకంగానే వ్యక్తమవుతూవుంటాయి. బిడ్డ ఆప్యాయంగా తల్లితొడలమీద పడుకొని స్తన్యపానము చేస్తున్నప్పుడు పరికించాలి. అది పాలు త్రాగటానికి ఎంత ఆతురత, ఆనందం చూపెట్టుతుందో, నోటికీ నాలుకకూ అసహ్యకరమైనవి తాకినపుడు ఏవిధంగా బిడ్డ చటుక్కున ముఖాన్ని ఆవలికి త్రిప్పివేస్తుందో మనం తఱచుగా చూస్తుంటాము. అంటే, యీ విధంగా బిడ్డ తన ఇష్టాయిష్టాలను వెలిబుచ్చుతుంది. కాబట్టే బిడ్డకు నోరు అనేది కేవలం ఆహారపానీయాదులను పుచ్చుకోటానికేగాక బాహ్యప్రపంచ ప్రథమ పరిచయమునకే ప్రధాన సాధన మవుతుంది. అందుచేతనే బిడ్డ చాలాకాలందాక ఏ వస్తువునైనాసరే, మొదట నోటిలో పెట్టుకొంటుంది. ఇందు

వల్ల విదితమయిన దేమంటే బిడ్డ తినటంమాత్రమేకాదు, ఆలోచించటంకూడా నోటిసహాయంతోనే చేస్తుంది.

## 5 మాతా శిశువులు

శిశువు తల్లిని ప్రేమించటంకూడా నోటిమూలకంగానే, తల్లిప్రేమను పరిగ్రహించటంకూడా నోటితోనే. ఉదా:- బిడ్డ తల్లిపాలను త్రాగుతూ కొంత ఆకలితీరగానే తల్లిపాలిండ్లతో ఆనందంగా ఆడుకోటం అందరం ఎరిగినవిషయమే. పాలను మ్రింగకుండా అట్టే నోట్లోపెట్టుకొని వింతవింత శబ్దాలు చేయటం, కాళ్ళు చేతులను ఆనందంతో ఆడించటం, పాలు త్రాగుతూ, మానుచూ ఆడటం మొదలయినవి మనం చూస్తూవుంటాము.

ఇది "బిడ్డయొక్క ప్రథమ ప్రేమ ప్రదర్శనం" అన్న మాట. ఈ తథ్యాన్ని గుర్తించలేని తల్లికి ఓపిక ఉండదు. విసుగుతో పాలిచ్చుట మానివేసి చీదరించుకొనును. అట్టి సందర్భంలో బిడ్డముఖం ముడుచుకొని, ఎర్రబారిపోతుంది. పిడికిలి బిగించుకొంటుంది. దేహాన్ని బిఱ్ఱున బిగదీసుకొంటూ కెవ్వున కేకపెట్టుతుంది. మరల తల్లి పాలివ్వబోగానే బిడ్డ యొక్క దేహం సడలి, ముఖంలో సంతృప్తి, సంతోషాలు కనబడుతవి. అతి ఆతురతతో పాలు త్రాగుతూ ఆకలినిమాత్రమే గాక తన ప్రేమతృష్ణను తృప్తిపరచుకొంటుంది. ఇందువల్ల రెండు ముఖ్యవిషయాలు విదితమవుతవి. తల్లి బిడ్డకు స్తన్యమివ్వట మనేది ఆహారమివ్వటమే కాదు; తన ప్రేమనుకూడ ఇవ్వటం అన్నమాట. బిడ్డ ప్రదర్శించే ప్రేమకు అవకాశ

మివ్వకుండా విసుగుకొనుటగాని, అసలే స్తన్యము నివ్వకపో వటంగాని సంభవిస్తే, తల్లి బిడ్డకు తనప్రేమను ఇవ్వక నిరాక రించినట్లవుతుంది. తల్లి తనబిడ్డకు పాలనిచ్చుటచేతనే మాతా శిశువులమధ్య సన్నిహిత సంబంధం, ఆత్మీయుత, పవిత్రప్రేమ ఏర్పడుతవి. కాబట్టి తల్లి పిల్లకు స్తన్యమిచ్చి పెంచటం ఎంత అవసరం, అమోఘం, పవిత్రకార్యం అనేది తల్లి గ్రహించుట అత్యవసరం. అయితే తల్లికి ఏ కారణంచేతనైనా పాలు లేక పోయినయెడల, బిడ్డకు పోతపాలే ఆధారమవుతుంది. అలాంటి సందర్భంలో సాధారణంగా తల్లులు పాలబుడ్డిని పిల్లల నోటికి అందించి, అవసరవసరంగా త్రాగేలాగు చేస్తుంటారు; లేక పాలబుడ్డి బిడ్డ నోటినుండి జారిపోకుండేలాగున ఏర్పాటుచేసి తమతమ పనులమీద వెళ్ళిపోతుంటారు. ఇలా చేసినందువల్ల బిడ్డ ఆకలి తీరవచ్చునుగాని తనివి తీరదు. తల్లి శరీరస్పర్శవల్ల కలిగే సుఖం కలుగదు. ప్రేమ తృప్తిచెందదు. [శిశువుకు ఆరంభంలోనే స్పర్శేంద్రియజ్ఞానం అభివృద్ధి చెందుతుందన్న విషయం గుర్తు తెచ్చుకోవాలి.] అందుచేత, తల్లీ పిల్లల మధ్య దినదినాభివృద్ధిచెందే సన్నిహిత సంబంధం, అను రాగం, ఆత్మీయత కొంత అరికట్టబడతవి. ఇంతేగాదు. శిశు శారీరకాభివృద్ధికీ ఆటంకం కలుగుతుంది. ఒక దృష్టాంతం తీసుకొందాం. ఇంగ్లాండులోని ఒకానొక శిశువైద్యశాలలో చేర్చబడిన కొందరు బిడ్డలకు రోగనివారణమయింది. కాని బలం కలుగలేదు. తూకం హెచ్చలేదు. దినాలు గడచిపోతు న్నాయి. డాక్టర్లు ఆలోచించసాగారు. తుదకొక నిర్ణయా నికి వచ్చారు.

"కేవలం టానిక్కులు, పుష్టికర ఆహార-పానీయాదులు మాత్రమే చాలవు. వానితోపాటు ప్రేమ అవసరం" అనే తథ్యాన్ని గ్రహించారు. బిడ్డలకు పాలు త్రాగించే సమయంలో లాలనచేస్తూ ముద్దులాడుట అత్యవసరమని నర్సులకు సలహానిచ్చారు. అలా కొంతకాలం చేయగా బిడ్డలు చక్కగా కోలుకొన్నారు. తూకం అధికమవుతూ చక్కగా పెరిగారు. కాబట్టి, తల్లి స్తన్యమిచ్చేటప్పుడు చేయులాగే బిడ్డను ఒళ్ళోపడుకోబెట్టుకొని బుజ్జగిస్తూ, ముద్దులాడుతూ పాలబుడ్డిని నోటికి అందించాలి. లాలించుతూ నెమ్మదిగా పాలను త్రాగించాలి.

కొరకడం : సాధారణంగా బిడ్డకు ఆరవనెలలో పళ్లు రావటం ప్రారంభమవుతుంది. ఈ పళ్లు రావటంతో బిడ్డ మానసిక జీవితంలోనే మరొక నూతనదశ ఆరంభమవుతుంది. బిడ్డకు ఇంతవరకూ నోటితో స్పృశించి గ్రహించుకొనుట, పాలను త్రాగుట మొదలగు వాంఛలు, లేక ప్రేరేపణలు (Impulses) మాత్రమే వుండినవి. ఇప్పుడు కొరకటం అంటే అధిక ఇష్టం.

నోటికి అందిన వస్తువులన్నింటిని కొరకటం, నమలటం పరిపాటి అయిపోతుంది. తల్లి పాలిండ్లను, తల్లి వ్రేలును, ఆటవస్తువులను—ఏది నోటి కందినా సరే—కొరకటమే ప్రధానలక్షణ మవుతుంది. బిడ్డకు మొదట పాలు త్రాగటం అనేది ఎంత ఆనందదాయకముగా వుండినదో, ఇప్పుడు కొరకటమనేది అంత ఆహ్లాదంగా వుంటుంది. బిడ్డ ఇలా కొరకటానికి కారణాలు రెండు :

ఒకటి : పళ్లురావటానికికలిగే దురదనుతీర్చుకొంటుంది.

రెండవది : అనురాగాన్నీ, ఆగ్రహాన్నీ వెలిబుచ్చటానికీ, వస్తుగ్రహణం కొఱకూ కొరుకుతుంది.

బిడ్డలు, సాధారణంగా, తల్లి స్తన్యపానంచేస్తూ చటుక్కున కొరుకుతారు. కారణం, తల్లిమీద ప్రేమను ప్రదర్శించటానికి ఈలా కొరుకుతారు. లేక, తల్లి బిడ్డనోటినుండి స్తనమును తప్పించితే ఆగ్రహంతో కొరుకుతారు. ఏడుస్తారు. ఈలాంటి సందర్భంలో నోటికి శుభ్రమైన ఆటవస్తువు నొకటిని అందించి నెమ్మదిగా స్తనమును తప్పించాలి. బిడ్డవద్దనే కూర్చుని కొంతసేపు లాలించి అలాచేస్తే బిడ్డకోపం చల్లారుతుంది; కొరికే వాంఛ తృప్తిచెందుతుంది; పళ్ళ దురద తీరుతుంది. ఇంతేగాదు, బిడ్డకు కొరికే వాంఛ కలగటంలో దాని మానసికజీవితంలో మరొక ముఖ్య దశ ప్రారంభమయిందని గ్రహించుకొని, తల్లి బిడ్డ అభివృద్ధికి తోడ్పడాలి.

## 6 భయం, కోపం మొదలైన మనఃప్రవృత్తులు

తల్లి స్తన్యపానమువల్ల, అందిన పదార్థాల్ని నోటిలో పెట్టుకొని కొరకాలన్న వాంఛవల్ల బిడ్డకు కొన్ని అనుభవాలు కలిగినవి. అదేవిధంగా భయం, కోపం మొదలైన మనోప్రవృత్తులవల్ల (**Emotions**) మరి కొన్ని అనుభవాలు కలుగుతాయి.

భయం :—

ప్రారంభదశలో, మనచేతుల్లోనున్న శిశువును తటాలున క్రిందపడుకోబెట్టినగాని, బిడ్డక్రిందనున్న పక్క బట్టల్ని చటుక్కున లాగినగాని, భయంతో బిడ్డ ఉలిక్కిపడుతుంది.

తలుపులు తెరచేటప్పుడు, మూసేటప్పుడు అయ్యో చప్పుడుకు, చేతిలోని పాత్రమొదలైన వస్తువులు క్రిందబడి టంగుమని శబ్దమయినపుడు, బిడ్డ ఉలిక్కిపడుతుంది. ముఖ్యంగా బిడ్డ నిద్రలో వున్నప్పుడు ఈలాంటి కఠోరశబ్దము లయితే బిడ్డ అత్యధిక భయాన్ని వెలిబుచ్చుతుంది.

కోపం :—

బిడ్డతలను అటు నిటు త్రిప్పకుండ అట్టే పట్టుకొన్నా, కాళ్ళు చేతులను ఆడించకుండేటట్టు పట్టుకొన్నా అది అసహాయతవల్ల ఆగ్రహాన్ని చూపెట్టుతుంది. కొంత పెరిగి గ్రహించేశక్తి అభివృద్ధియైనపుడు బిడ్డ వాంఛలు, కోరికలు (Desires) నెరవేరని సమయాల్లోమాత్రమే కోపోద్రేకాన్ని వెలిబుచ్చుతుంది. ఈలాంటి విషయాల్లోనేగాక తన కపరిచితమైన, అయిష్టమైన సందర్భాలన్నిటిలోగూడ బిడ్డ భయం, కోపం మున్నగు ఉద్రేకాల్ని వ్యక్తపరుస్తుంది.

ఆతురత:—

బిడ్డ ఆకలికీ, నిద్రకూ, మరేదైన అవసరమయినపుడూ హఠాత్తుగా ఏడ్వటం మొదలెట్టుతుంది. ఒకేపోరు పెట్టుతుంది. తనకుకావలసినది తక్షణమే లభించాలి. అలా లభించకపోతే కోపం, లభించితే సంతోషం చూపెట్టుతుంది. అనగా బిడ్డ వాంఛలు, కోర్కెలు (Impulses, desires) ఒక త్రుటీ కాలంలో తృప్తిచెందాలి. ఎంతమాత్రం ఆలస్యమయినాసరే, అది ఓర్చుకోజాలదు. పైగా ఎంతో బాధపడిపోతుంది. ఇంతేగాదు, తనుకోరిన పదార్థమంతా కావాలనికూడ పోరుపెట్టుతుంది. బిడ్డయొక్క ఇట్టిప్రవర్తనల్ని తల్లి పరిశీలించుట

అవసరం. బిడ్డకు కాలదేశపరిమాణం ఎంతమాత్రం తెలియదు. ఆకలి అవుతుండగా ఆహారం కడుపులోపడాలి. నిద్రవస్తుండగా నిరాటంకంగా నిద్రపోవాలి. ఏపదార్థమైనాసరే, అది ఎంత దూరంలోవున్నాసరే, కోరినక్షణమే తనచేతుల్లోపడాలి. వేయెందుకు! బిడ్డలో వాంఛలు, కోరికలు (Impulses, desires) ఉద్భవమందిన తత్క్షణం నెరవేరాలి. కాని వేచివుండటం అనే విషయం బిడ్డలకు తెలియదు. అనగా, కోర్కెలుపుట్టటం నెరవేరటం అనేవాటిమధ్య కాలాన్ని బిడ్డ ఎరుగదన్నమాట. (నిత్యవర్తమానమన్నమాట.) తనకు అవసరమైనపదార్థము లభించుతుంది కాని వేచివుండాలన్న జ్ఞానంగాని, తనకది ఎంత అవసరంఅన్న విచక్షణగాని బిడ్డకుండవు. కాబట్టే, వెంటనే తనకోర్కెలు తృప్తిచెందకపోతే ఆబాధ దానికి అపరిమితంగా గోచరిస్తుంది. సంతృప్తిచెందితే సంతోషంకూడ అపరిమితం గానే వుంటుంది. కనుక తల్లి బిడ్డవాంఛల్ని, కోరికల్ని వెంటనే తీర్చినయెడల బిడ్డయొక్క సంతృప్తికీ సంతోషానికి కారణభూతురాలవుతుంది. అలక్ష్యంచేస్తేగాని, బిడ్డ అసంతృప్తికి, ఆశాభంగం, ఆగ్రహం, నిర్నిమిత్తమైన భీతి మొదలైన బాధాకరమైన ఉద్రేకాలకు కారణభూతురాలవుతుంది. అంచేతనే తల్లి శిశుమనస్తత్వాన్ని చక్కగా యెఱిగి మెలకువతో మెలగాలి.

ఒక ఉదాహరణం తీసుకొందాం:— ఒక యువతి తన సుమారు ఆరునెలల బిడ్డను తోపుడుబండిచుట్టూ దిండ్లువేసి (అనగా వెనక ఒత్తుకుదిండు, యిరుప్రక్కల రెండు దిండ్లు) కూర్చుండబెట్టి, తనభర్తతో మాట్లాడుతూ నిలుచుంది. ఆడు

కోటానికి బిడ్డ చేతిలో ఒక ఆటవస్తువునుకూడ పెట్టింది. కాని, బిడ్డ ఆటవస్తువును పారవేసి, తన తల్లినీ, తండ్రిని అట్టే చూడసాగింది. వారు దాన్ని గమనించలేదు. వింత వింత శబ్దాలు చేయసాగింది, కాని లాభంలేకపోయింది. మెల్ల మెల్లన ఏడ్వనారంభించింది. అప్పటికీ తల్లి గమనించలేదు. ముందుకూ వెనుకకూ పడుతూ పోరుపెట్టసాగింది. మాటలలో మునిగి పోయిన తల్లి వినిపించుకోలేదు. ఎవరో కొట్టినట్టు తటాలున కెవ్వుమని కేకపెట్టింది. తల్లి తిరిగిచూసింది. ఓరిగిలపడుకో బెట్టిన బిడ్డ పిడికిలిబిగించి కోపంతో తల్లిని చురచుర చూస్తూ కూర్చునివుంది. ముఖం యెర్రగా కందిపోయింది. దాని కోపం తక్షణమే చల్లారి దానిముఖంలో సంతృప్తి, సంతోషాలు వ్యక్తమయినాయి.

బిడ్డ పెరుగుతూ, గ్రహణశక్తి వృద్ధి అయినకొలదీ, అనుభవములఫలితంగా బిడ్డయొక్క వాంఛలు, కోరికలలో, కోపతాపములలో తీవ్రత తగ్గుతూవస్తుంది. క్రమేణ ఆతురత తగ్గి, కాలదేశ పరిజ్ఞానము, తన కోర్కెలు ఈడేరుతవి అనే నిరీక్షణ, నమ్మకం కలుగుతూవస్తాయి. కోపం కలిగినప్పటికీ కొద్దికాలంక్రితమే తనకు లభ్యమయిన తల్లివాత్సల్యం గురుతుకురావడం ప్రారంభమవుతుంది. తనకు త్వరలో తృప్తి కలుగుతుందని నిరీక్షణ ఏర్పడుతుంది. మరింత విపులంగా చెప్పాలంటే, తల్లి కాళ్ళచప్పుడువలన, కంఠధ్వనివలన, స్పర్శ వలన, తనకు పాలివ్వటానికి ముందు స్నానంచేయించే సన్నాహాముల శబ్దంవలన (నీళ్లు తోడునపుడుఅయ్యే చప్పుడువగైరా)

తనకోర్కె నెరవేరుతుందనే నిరీక్షణ ఏర్పడుతుంది. కనుక, బిడ్డకిదివరకున్న కోపం, ఆతురత తగ్గుతూ, ఓర్పు, నిరీక్షణ, నమ్మకం మొదలైన గుణాలు పట్టుబడుతాయి.

**తల్లికి ఓర్పు అత్యవసరము :—**

బిడ్డ శారీరకంగా, మానసికంగా అనుక్షణం పెరుగుతూ వుంటుంది. అలా పెరగటంలో అది అనేకదశలను గడపవలసి వున్నది. అందువల్ల తల్లి బిడ్డయొక్క అభివృద్ధిక్రమంలోని ప్రతిదశను పరికించుతూ, పరిశీలించుతూ విజ్ఞానవిచక్షణలతో తోడ్పడాలి. ఎంతో ఓర్పుఉండాలి. అయితే ఆ ఓర్పు విజ్ఞానయుక్తమయినదిగా వుండాలి అనేవిషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి.

శైశవదశలో, బాల్యదశలో, బిడ్డయందు ప్రదర్శితమయే కొన్నిప్రవర్తనలు పెద్దవాళ్ళకు చాలవింతగానూ, విచారకరంగాను గోచరించవచ్చును. కాని అవి బిడ్డయొక్క అభివృద్ధిక్రమంలో సహజమైన ప్రవర్తనలు. ఉదాహరణకు బిడ్డకొరికే ప్రవర్తనను తీసికొందాము. ఇదివరకే తెలుసుకొన్నట్లుగా, అది బిడ్డయొక్క అభివృద్ధిక్రమంలో అవసరమైన ఒక దశకదా! అంటే, పళ్ళురావటానికీ, పదార్థపరిజ్ఞానానికీ అలా కొరుకుతుందన్నమాట. శారీరక మానసికఅభివృద్ధికి ఆవిధంగానే, బిడ్డ, ఒకానొకదశలో తన మలమూత్రాలతో అసహ్యాతన్నమాటలేక ఆడుకొంటుంది. దేహాన్నీ, దుస్తులనూ మురికిచేసుకొంటుంది. బిడ్డకు అసహ్యాత, అశుభ్రత అనేవి తెలియవు. ఆరీతిగానే కోపం పెంకితనం వెలిబుచ్చుతుంది. తల్లి ప్రశాంతంగావుండి, బిడ్డను మెళకువతో తోడ్ప

డితే, ఈ దశలు క్రమక్రమంగా గడచిపోతవి. అలాచేయకుండా, తల్లి బిడ్డనుమందలించితే మరింత పెంకితనం చూపెట్టుతుంది. అతిబాల్యంలోనే బిడ్డలు సహజంగా సూక్ష్మగ్రాహులు. విసుకునూ, ఆగ్రహాన్ని, ఆతురతనూ తల్లి ముఖంలో, కంఠధ్వనిలో, స్పర్శలో చక్కగ గ్రహించి మరింతఎక్కువగా పెంకితనాన్ని చూపెట్టుతారు. చీటికీమాటికీచీదరించుకొనుతల్లిని మరింతఎక్కువగా చీకాకుపెట్టుతారు. ప్రశాంతంగా ప్రేమతో తోడ్పడే తల్లిని చీకాకుపెట్టరు. పిల్లలు పెద్దలవలే ప్రవర్తించాలనుకోటం కేవలం అజ్ఞానాన్ని సూచించుతుంది. అట్లనుకొనువారియందు శాస్త్రీయదృక్పథం ఎంతమాత్రం లేదనుట తేటతెల్లం! కాబట్టి తల్లి, తనమాటలలోగాని, చేతలలోగాని, ఆగ్రహం, అసంతృప్తి ఎంతమాత్రం చూపెట్టకుండా మంచి తెలివితేటలతో, సహనంతో బిడ్డయొక్క అభివృద్ధికి తోడ్పడాలి.

ఈవిధంగా, బిడ్డఅభివృద్ధిక్రమంలో ఒకదశను గడిపి మరొకదశలో అడుగుపెట్టుటకు తల్లి విజ్ఞానదృక్పథంతో, అత్యంత అనురాగంతో బిడ్డనుతోడ్పడాలి. కాని, బిడ్డను మందలించుట, కొట్టుట, తిట్టుట, భయపెట్టుట అనేవి ఎంతమాత్రం పనికిరావు. అవి బిడ్డయొక్క అభివృద్ధిని అరికట్టేవి అనికూడ గుర్తించాలి. అలాంటివాతావరణంలో పెరిగేపిల్లల అభివృద్ధి కుంటుబడుటేగాక, వారి సంఘజీవితంకూడ కుంటుబడుతుంది. అనురాగ ఆదరణలతోగూడిన వాతావరణంలో పెరిగేపిల్లలవలె వీరు స్వేచ్ఛగా, సంతోషంగా తోటిపిల్లలతో కలిసిమెలిసి ఆడుకోలేరు. పైగా, వీరి మానసికాభివృద్ధి అరికట్టబడుతుంది. అంటే, వయస్సునకుతగిన తెలివితేటలు

వ్యక్తంకావు. తమకన్న ఎంతో తక్కువవయస్సులోనున్న శిశువులలాగు ప్రవర్తిస్తారు. ఆకలిగొన్న బిడ్డ ఆహారంకోసం ఏడ్చి ఏడ్చి తుదకు నీరసపడిపోయినట్లే, తల్లిప్రేమకోసం తహతహలాడిపోతూ మానసికంగాకూడా నీరసపడిపోతారు. తత్ఫలితంగా, బిడ్డలో వయస్సుకుతగిన బుద్ధివికాసం కలుగదు. వికాసానికి మారు పెంకెతనం, కొంటెచేష్టలు పెరిగిపోతూ, చివరకు మూఢత్వం, మూర్ఖత్వం పట్టుబడుతాయి. ఇంతే గాదు. భయం, దెబ్బలు, తిట్లుగల అనాగరిక వాతావరణంలో పెరిగేపిల్లలకు అనేక విధములైన మానసిక వ్యాధులు ఏర్పడుతవి అనేవిషయాన్ని గుర్తుంచుకోవాలి.

కొంత సంస్కారంగల కుటుంబాల్లో బిడ్డలను కొట్టటం, తిట్టటం కొంత మానివేశారుగాని, భయపెట్టటంమాత్రం ఇంకనూ పోలేదనే చెప్పవచ్చును. ఒకవేళ భయపెట్టటంమానివేసినా, తల్లిదండ్రులు తమబిడ్డలప్రవర్తనలను ఇతరులఎదుట ఆక్షేపించటం, అపహాస్యంచేయటం, అగౌరవపరచటం పోలేదు. బిడ్డలు అతిసూక్ష్మగ్రాహులు. వారిహృదయం అతి సున్నితంగావుంటుంది. అలాంటివారిని అతిక్రూరంగా ఆక్షేపించుటవల్ల, అపహాస్యంచేయుటవల్ల, అగౌరవపరచుటవల్ల బిడ్డలు చాల బాధపడిపోతారు అయితే, ఆదిలో వారు అంతబాధపడినా, క్రమేణ వీటికి గమనమివ్వటం మానివేస్తారు. ఇందువల్ల, వీరికి అనేకవిధములైన మానసిక వ్యాధులు, దుర్గుణాలు పట్టుబడుతాయి. అంచేతనే తల్లి బిడ్డను ప్రేమతో పెంచుటయేగాక, బిడ్డయందు గౌరవంకూడ చూపెట్టాలి. పెద్దలు చూపెట్టేగౌరవంవల్లనే పిల్లలలో ఆత్మ

గౌరవం అనేది ఏర్పడుతుంది. ఆత్మగౌరవంగలపిల్లలు అందరికీ గౌరవంచూపెట్టుతారు. సభ్యతఅనేది నేర్చుకొంటారు.

తల్లి గమనించవలసిన కొన్నిముఖ్యవిషయాలు: కొరికే బిడ్డనుగురించి కొంత ఆలోచిద్దాం.

సామాన్యంగా, బిడ్డలు తమప్రేమను ప్రదర్శించేటప్పుడుగాని, కోపాన్నిచూపేటప్పుడుగాని చటుక్కున కొరుకుట పరిపాటి. కాని, అంతమాత్రంచేత బిడ్డ చిలిపితనంవల్ల క్రూరస్వభావంవల్ల కొరుకుతుందని అనుకోటం చాలపొరపాటు. కొరకటంఅనేది సామాన్యంగా బిడ్డలందరికీ పరిపాటే. నాలుగైదేళ్ళ బాలుడుగాని, బాలికగాని కోపంచేత లేక తమఇష్టానికి అడ్డుతగలటమో, కోరిక నెరవేరకపోవటమో సంభవించినప్పుడు కలిగే ఆశాభంగంచేత కొరుకుతుంటారు. కాని, పెరిగిపెద్దవారైన తరువాతకూడ వీళ్ళకు కొరికేఅలవాటు స్థిరంగావుండిపోతుందని భయపడనవసరంలేదు. అయితే, నాలుగైదేళ్ళు ఈడువచ్చినతరువాతకూడ బిడ్డలు తఱచుగా కొఱకటానికి కారణాలు తల్లిపరిశీలించుట అత్యావసరం. ఎందుకంటే, సామాన్యంగా బిడ్డయొక్క అభివృద్ధిక్రమంలో ఏదో లోటు ఏర్పడివుంటుంది. ఆ లోటునుండి కాపాడుకోటానికి బిడ్డలు, సహజంగా ఈవిధమైన కోపోద్రేకాన్ని వెలిబుచ్చుతారు తమకోర్కెలు నెరవేరనప్పుడు, ఆశాభంగం కలిగినపుడు ఎంతమాత్రం సహనమనేది బిడ్డకు వుండదు. ఈ విషయాన్ని తల్లి గుర్తించకుండ ఈ అలవాటును తప్పించటానికని బిడ్డను ఏవిధంగాకాని శిక్షించటం అనేది చాలా పొరపాటు. అలా శిక్షించుటవలన, బిడ్డయొక్క అభివృద్ధి అరికట్ట

బడుతుంది. వయస్సుకు తగినట్లుగా మానసిక ప్రవృత్తులు అభివృద్ధిచెందవు, బుద్ధి వికసించదు. అంటే, బిడ్డ శారీరకంగా పెరిగినప్పటికీ, మానసికంగా పెరగదు. శైశవావస్థలోని మానసిక ప్రవృత్తులే వ్యక్తమవుతూంటాయి. అయితే కొరికే బిడ్డవలన తక్కినపిల్లలకు హాని సంభవించకుండ తల్లి జాగ్రత్త వహించాలి.

బిడ్డ తోటిపిల్లలతో పోట్లాడి కొరికేటప్పుడుగాని, మనల్నే కొరకటం సంభవించినపుడుగాని తల్లి ఎలా ప్రవర్తించాలి అనేవిషయం ఆలోచించుట అవసరం. బిడ్డ ఎవరినైనా సరే అలా కొరికినపుడు తత్క్షణమే బిడ్డను తక్కిన పిల్లలనుండి వేరుచేసి "ఆ బిడ్డను కొరకనియ్యను, నన్ను కొరకనియ్యను" (తల్లిని కొరికినసందర్భంలో) అని చెప్పి నిరోధించాలి. కాని "అబ్బ నీ వెంతమూర్ఖుడవు" అంటూ "ఇతరులను కొరకటం ఎంత దుర్మార్గం, పాపం!" అని మందలించుతూ నీతిని బోధించకూడదు. (బిడ్డకు పాపం, పుణ్యం అనే విషయాలు అర్థం కావు). ఎదుటిబిడ్డను చేరదీసి బుజ్జగించాలి.

తల్లి తనబిడ్డ తోటిపిల్లను కొరికినతరువాతనే చూడటం తటస్థించితే, బాధపడుతున్న పిల్లను దగ్గరకుతీసుకొని బుజ్జగిస్తూ ఓదార్చుటద్వారా తనబిడ్డకు గుణపాఠం నేర్పాలి. కాని కొట్టుట, తిట్టుటద్వారా కాదు. ఆటచెలికాండ్రను తల్లి తన కొరికేబిడ్డనుండి వేరుచేసి వాళ్ళను బుజ్జగించటం, ప్రేమించటంవల్ల ఇకమీదట కొరకకూడదు. అలా కొరికితే తనకు తల్లిప్రేమ లభించదు అనే విషయాన్ని బిడ్డ గ్రహించుకొం

టుంది. అలా బిడ్డ గ్రహించినదని తల్లి గుర్తించినవెంటనే ఆమె తనబిడ్డనుకూడ చేరదీసి తన ప్రేమను వెలిబుచ్చాలి. కొన్ని సందర్భాలలో పిల్లలు తమ ఆధిక్యతను, వ్యక్తిత్వాన్ని వ్యక్తపరచటానికి ఈవిధంగా కోరుకుంటారు. ఈవిషయాన్ని గ్రహించుకొని తల్లి తోటిపిల్లలకు హాని సంభవించకుండ జాగ్రత్తవహించి తన బిడ్డవ్యక్తిత్వం అభివృద్ధిచెందుటకు అవసరమైన సన్నివేశసందర్భాన్ని కల్పించాలి. కాని శిక్షించుట, బెదిరించుట అనేవి ఎంతమాత్రం కూడదు. తల్లి పాలిళ్ళను కోరికే బిడ్డవిషయంలోకూడ ఇంతేను. శిశువు తల్లి పాలిళ్ళను కొరికినప్పుడు సామాన్యంగా తల్లులు బిడ్డనుకొట్టుతారు. బెదరించుతారు. ఈలాంటి మోటుతనంవల్ల బిడ్డలో కోపస్వభావం ఎక్కువ అవుతుంది. నెమ్మదిగా స్తనములను బిడ్డనోటినుండి తప్పించాలి. తల్లి బిడ్డకు స్తన్యమిచ్చుట అనేది ఎంతో పవిత్రకార్యం. ఇందువల్ల తల్లీ పిల్లలమధ్య సన్నిహితసంబంధం, పవిత్రప్రేమ, ఆత్మీయత అనేవి ఏవిధంగా అభివృద్ధి చెందుతవి అనే విషయాలు ఇదివరకే తెలుసుకొనియున్నాము కదా. అయితే మరికొన్ని విషయాలుకూడ తెలుసుకొనుట అవసరం.

బిడ్డ ఆకలికి ఏడ్చినవెంటనే తల్లి స్తన్యమిచ్చి తృప్తిపరచాలి. వెంటనే స్తన్యమివ్వక బిడ్డను వేచియుండేలాగున చేసినయెడల బిడ్డ ఆకలిచే బాధపడటమేగాక బిడ్డ అప్పుడప్పుడు ప్రదర్శించే ప్రేమకు భంగంవాటిల్లుతుంది. అనగా, బిడ్డ ఏడ్వటం ఆకలితోమాత్రమేగాదు. తల్లిప్రేమకోసంగూడ ఏడుస్తుంది. ఆకలి కెంత అలమటించిపోతుందో తల్లిప్రేమకోసం

కూడ అంత అలమటించిపోతుంది. తల్లి స్తన్యపానంవల్ల బిడ్డ శారీరకంగా పెరిగినట్టే తల్లి ప్రేమవల్ల మానసికంగా పెరుగుతుంది ఈ విషయాన్ని తల్లి చక్కగా గ్రహించాలి.

బిడ్డ, నిర్ణీతకాలంలో (అనగా ఆకలి వేళలలో), తల్లి పాలనుత్రాగటం, తల్లితొడమీద పడుకొని తల్లిప్రేమనుగ్రోలటం చేస్తూ క్రమక్రమంగా అలవాటుపడిపోతుంది. వేచి వుండటం నేర్చుకొంటుంది. తల్లిప్రేమ లభించకపోతే ఏదో అగాధంలో పడిపోతున్నట్లు భయపడుతుంది. తల్లి ఈ విషయాలు గ్రహించి, శిశుమనోవిజ్ఞానదృష్టిలో బిడ్డఅభివృద్ధికి తోడ్పడినట్లైతే, బిడ్డలోమొండితనం, కోపంమొదలైనవిపోయి, ప్రేమ, ఓర్పు మొదలైన మనఃప్రవృత్తులు అభివృద్ధిచెందుతవి.

## 7 స్తన్యము మాన్పించుట

బిడ్డకు స్తన్యం మాన్పించుట అనేది ఒక గడ్డుసమస్య. అందులో బిడ్డకు ఒక సంవత్సరంపాటో, లేదా కనీసం ఎనిమిది తొమ్మిదినెలలవరకైనా పాలివ్వకుండ హఠాత్తుగా ఒక్కసారే మాన్పించటం అనేది చాల కష్టమైనకార్యం. చంచాతోనో, పాలశంఖుతోనో, పాలబుడ్డితోనో పాలుత్రాగేలాగు అలవాటుచేసినప్పటికీ బిడ్డ ఆకలితీరుతుందిగాని తనివితీరదు. తల్లి అంకపాళిలో ఆప్యాయంగా పడుకొని స్తన్యపానంచేస్తూ, దానితోపాటు తల్లి ప్రేమను చూఱగొనే అవకాశం బిడ్డకు లభించదు. కాబట్టే దానికి మానసికంగా సంతృప్తికలుగదు. తల్లి ఒడిలో పడుకొన్నప్పుడు కలిగే సౌఖ్యం, తల్లి ముఖంలో

వ్యక్తమయ్యే వాత్సల్యం, తన ఆటలవలన తల్లి ముఖంలో కన బడే చిఱునవ్వు, ఆమె వాత్సల్యపూరితమైన కంఠస్వరము, మున్నగువానిని గ్రహించగల ఈడువచ్చినపుడు బిడ్డకు స్తన్య పానం మాన్పించుట సులభసాధ్యం. కాని ఇట్టి గ్రహణశక్తి అభివృద్ధికాకముందు మాన్పించుట అతి కష్టమైన కార్యం. ఇందులో తల్లి స్తన్యపానం సర్వవిధాల సౌఖ్యదాయకంగా గోచరించేకాలంలో తటాలున మాన్పించటం అనేది ఎంత క్రూరకార్యమో చెప్పటానికే అలవిగాదు. తల్లి బిడ్డకు పాలివ్వకపోవటంఅనేది బిడ్డకు తన ప్రేమనివ్వకపోవటం అన్న మాటే. తత్ఫలితంగా బిడ్డ మానసికంగా చాల బాధపడు టయేగాక దాని మానసికప్రవృత్తులలో మార్పుకూడ కలుగు తుంది. మానసికాభివృద్ధి అరికట్టబడుతుంది. కనుక ఏ కార ణంలేకనే తల్లి తనబిడ్డకు పాలివ్వకపోవటంగాని, ఒకేమాటు మాన్పించటంగాని సంభవిస్తే తల్లి తనబిడ్డకెంతో కీడుచేసి నట్టు అవుతుంది. ఈ విషయాన్ని తల్లి గుర్తుంచుకోవాలి. అవసరమున్నంతకాలం అనగా కనీసం పదినెలలపాటైనా బిడ్డకు పాలివ్వాలి. తరువాత క్రమేణ నెమ్మదిగా మాన్పించాలి. అనగా స్తన్యపానం మాన్పించటం అనేది క్రమేణ జరగాలి. కాని ఒక్కమాటే తటాలున మాన్పించకూడదన్నమాట.

మొదటినుండే ఒకటి రెండునెలల ఈడులోనే శిశువుకు అప్పుడప్పుడు చంచాతో నీళ్ళు త్రాగించుతూ అలవాటు చేయాలి. బిడ్డ తల్లివద్ద పాలు త్రాగుతున్నప్పుడుకూడ అప్పు డప్పుడు పాలను చంచాతోనో, పాలసీసాతోనో కొద్దిగా త్రాగేలాగు అలవాటుచేయాలి. అలాంటిసమయంలో తల్లి

బిడ్డను తొడలమీద పడుకోబెట్టుకొని వాత్సల్యాన్నీ, సంతో షాన్నీ వ్యక్తపరచాలి. ఇలా అప్పుడప్పుడు పాలబుడ్డితోనో, చంచాతోనో పాలను త్రాగేలాగుచేస్తూ, క్రమక్రమంగా నెమ్మదిగా స్తన్యపానాన్ని మాన్పించాలి. తల్లి తనపాలను పూర్తిగా మాన్పించి పాలబుడ్డితోమాత్రం త్రాగించేటప్పుడు బిడ్డ చెంతనేవుండి ఆలనపాలనచేస్తూ తన వాత్సల్యాన్ని వెలిబుచ్చుట అవసరమనేవిషయాన్ని మరవకూడదు. సాధారణంగా తొమ్మిది పదినెలల బిడ్డలకు స్తన్యపానం మాన్పించుట అంత కష్టతరమైనకార్యం కాదు. ఎందుకనగా సుమారు తొమ్మిది పదినెలలకాలం బిడ్డ తల్లి పాలు త్రాగుటచేత దాని వాంఛ చాలవరకు తృప్తిచెందివుంటుంది. ఈమధ్య తల్లి ప్రేమ కావలసినంత లభించి సంతృప్తికలిగివుంటుంది. ఇంతేగాదు, ఇతరసమయాల్లోనయితం తల్లి వెలిబుచ్చే ప్రేమను క్రమేణ గ్రహించేశక్తి అభివృద్ధిచెందుతూ వస్తుంది. తల్లి పాలను పూర్తిగా మానివేసినప్పటికీ తనకు తల్లి ప్రేమ సర్వదా లభిస్తుం దనే గట్టి నమ్మకం, నిబ్బరం ఏర్పడుతుంది.

అయితే బిడ్డలందరూ ఒకేవిధమైన స్వభావంగలవారుగా వుండరు. కొందరిని స్తన్యపానమును మాన్పించుటలో అంత కష్టముండదు. మరికొందరిని నెమ్మదిగా, క్రమక్రమంగా మాన్పించుట అవసరం. అంటే తల్లి తనబిడ్డనైజాన్ని ఎరిగి మెలకువతో మెలగాలన్నమాట. అలా చేయకపోతే బిడ్డలు మానసికంగా బాధలువడి వారి మానసికాభివృద్ధి కుంటుబడుతుంది. కొన్నివేళల్లో బెంగవల్ల శారీరకంగాకూడ బాధ

కలుగవచ్చును. కనుక తల్లి కొన్ని ముఖ్యవిషయాల్ని గుర్తుంచుకొనుట అత్యవసరం.

1. తనకు వ్యాధివల్లనో, నీరసంవల్లనో బిడ్డకు స్తన్యమివ్వకూడదని వైద్యులు నిరోధించిన సందర్భంలోతప్ప, తల్లి తప్పనిసరిగా తనబిడ్డకు స్తన్యమిచ్చుట అవసరం.

2. ఒకటి రెండు నెలల బిడ్డకే చంచాతో పాలను, నీళ్ళను అప్పుడప్పుడు త్రాగించుతూ అలవాటుచేయాలి.

3. తటాలున స్తన్యపానం మాన్పించకూడదు. క్రమేణ నెమ్మదిగా మాన్పించాలి. అనగా కొన్నిమాట్లు స్తన్యమిస్తూ మరికొన్నిపర్యాయాలు పాలబుడ్డితో లేక చంచాతో పాలు త్రాగించుతూరావాలి. నాలుగైదునెలల ఈడు రాగానే కొన్నిసార్లుఅయినా పాలబుడ్డితో త్రాగే అలవాటుచేయాలి. క్రమక్రమంగా ఎక్కువసార్లు పాలబుడ్డితో త్రాగించాలి.

4. కనీసం ఎనిమిది తొమ్మిది నెలలపర్యంతం బిడ్డకు తల్లిపాలు అత్యవసరం.

5. బిడ్డకు పాలబుడ్డితో పాలను త్రాగించేసమయాల్లో తల్లి బిడ్డను తనతొడమీద, లేదా ప్రక్కన పడుకోపెట్టుకుని వాత్సల్యాన్ని కనబరచుతూ, లాలించుతూ త్రాగించాలి. కాని పాలబుడ్డిని బిడ్డనోటికందించి ఒంటరిగా విడిచి లేచిపోకూడదు. ఇది చాల క్రూరమైన కార్యమని చెప్పకతప్పదు. అలా చేయటంవల్ల బిడ్డ మానసికంగా చాలబాధపడిపోతుంది. దాని అభివృద్ధి కుంటుబడుటేగాక కొన్ని లోట్లుకూడ ఏర్పడుతాయి.

6. బిడ్డ లందరిస్వభావం ఒకేరీతిగ వుండదు. తల్లి పాలు మాన్పించటంలో కొందరు బిడ్డలకు మానసికంగా చాల బాధకలుగుతుంది. కొందరు అంత బాధపడరు. అందుచేత తల్లి తనబిడ్డనైజాన్ని ఎరిగి మెలకువతో మెలగాలి. అనగా క్రమక్రమంగా, జాగ్రత్తగా మాన్పించాలి.

7. ఇక పాలబుడ్డినుండి పాలగిన్నెకు మార్చటంకూడ నెమ్మదిగా, క్రమక్రమంగా జరగాలి. ఒక్కమాటే జరగ కూడదు. బిడ్డ అలా గిన్నెతో త్రాగకపోతే కొందరుతల్లులు పాలబుడ్డిని దాచి, పగిలిపోయిందనిచెబుతూ గిన్నెతో త్రాగ మని నిర్బంధించుతారు. మరికొందరు బిడ్డఎదుట పాలసీసాను పగులగొట్టి గిన్నెతో త్రాగమని బలాత్కరించుతారు. యీ విధమైన తల్లి అజ్ఞానం, మొటుతనంవలన బిడ్డ చెప్పరాని బాధలను అనుభవించుతుంది. అంతేగాదు, బిడ్డస్వభావంలో అనేక లోట్లు, మానసికవ్యాధులు ఏర్పడుతవి.

ఇంగ్లాండు మున్నగు పాశ్చాత్యదేశాల్లోని మానసిక వ్యాధులకు చికిత్సచేయు వైద్యశాలల్లో పరిశోధన చేయగా, అనేక మానసిక వ్యాధులు క్రమక్రమంగాగాక, తటాలున స్తన్యపానంమాన్పించినందుచేత, పాలసీసాను బిడ్డనోటికందించి ఒంటరిగా విడిచి తల్లులు తమతమ పనులమీాద వెళ్ళిపోవుట చేత, అన్నిటికన్న పాలబుడ్డిని దాచివేసి లేదా బిడ్డయెదుట పగులగొట్టి గిన్నెతో పాలు త్రాగమని నిర్బంధించినందుచేత ఏర్పడినవని తేలింది. కాబట్టి తల్లి ఈవిషయంలో ఎంతో విచక్షణ నుపయోగించి మెలకువతో ప్రవర్తించాలి అనే విషయం విదితమవుతుంది.

మరొక ముఖ్యవిషయం :—

కొందరు తల్లులు బిడ్డకు స్తన్యమిచ్చుటవలన తమకు ఆనందంగా వుంటుందనీ బిడ్డ తమపాలను త్రాగుతున్నంత కాలము తమకు తిరిగి గర్భంరాదనీ ఎంచి బిడ్డకు సంవత్సరం పైబడి రెండేళ్ళుదాకకూడ స్తన్యమిచ్చుట కలదు. అది చాల పొరబాటు. బిడ్డకు తొమ్మిది పదినెలలవరకు స్తన్యమిస్తే చాలును. పైబడి ఇస్తే ఒక ఏడాదిదాక ఇవ్వవచ్చునే గాని అంతకన్న ఎక్కువకాలం అనవసరం. అలా యిచ్చిన యెడల మానసికాభివృద్ధికి మంచిదికాదు సరేగదా, శారీరకంగాకూడ అంత మంచిదికాదు. ఎలాగంటే తల్లిపాలు త్రాగునంతకాలం బిడ్డ ఇతర ఆహారాన్ని పుచ్చుకోదు. తల్లి పాలయందుండు మక్కువ మరే పదార్థాలమీద దానికుండదు. ఒక సంవత్సరం నిండిపోయినబిడ్డకు కేవలం తల్లిపాలుచాలదు. దాని శరీరపోషణ కవసరమైనంత పుష్టికరపదార్థాలు చాలవు. అంచేత స్తన్యం మాన్పించి ఇతర ఆహారపదార్థాలు పెట్టాలన్నమాట. ఇక మానసికజీవితంవిషయంలో బిడ్డ ఎప్పుడూ తల్లిమీద ఆధారపడుతుంది. స్వయంగా ఆడుకోటంగాని, స్వేచ్ఛగా తోటిపిల్లలతో కలసిమెలసి ఆడుకోటంగాని చేయదు. తత్ఫలితంగా బిడ్డమానసికాభివృద్ధి కుంటుబడుతుంది. ఒక సంవత్సరం, సంవత్సరం ఆరునెలలవయస్సున్నప్పటికీ అది కొన్ని నెలల శిశువులాగు ప్రవర్తిస్తుందికూడాను.

బిడ్డవిషయంలో అతి సున్నితంగా ప్రవర్తించాలి :—

బిడ్డనెత్తుకోవటం, పడుకోపెట్టటం మున్నగువిషయాల్లో తల్లి అతి సున్నితంగా ప్రవర్తించాలి. బిడ్డకు దుస్తులువేయ

టంలో, తీయటంలో అతి జాగ్రత్తగా ప్రవర్తించాలి. మోటుతనంగాచేస్తే బిడ్డకు బాధకలగటమేగాక, భయంకూడ కలుగుతుంది. దుస్తులు వదులుగా ఉండాలి. అలా లేనిచో తొడిగేటప్పుడు బిడ్డశరీరం కందిపోతుంది. ఆలస్యంకూడ అవుతుంది. బిడ్డ బాధనెలాగు భరించజాలదో అదేవిధంగా ఆలస్యాన్ని కూడ ఓర్చుకోజాలదు. అసలు బట్టలే లేకుంటే స్వేచ్ఛగా ఆడుకోటానికి అనువుగావుంటుంది. అలావుండటం బిడ్డకు ఇష్టంకూడాను. అయితే శీతోష్ణస్థితులనుబట్టి తల్లి విచక్షణతో వర్తించాలి. సాధ్యమైనంతవరకు బిడ్డకు దుస్తులు తొడగకపోవటం ఉత్తమం. శారీరకంగానేగాక, మానసికంగా కూడ బంధింపబడినట్లు బిడ్డ బాధపడుతుంది. అవసరమున్నపుడుమాత్రం వదులుగా దుస్తులు నెమ్మదిగా, సున్నితంగా తొడగాలి. అవసరంలేనపుడు అసలు బట్టలే వేయటంమాని వేస్తే బిడ్డ స్వేచ్ఛగా ఆడుకుంటుంది. ఆరోగ్యానికికూడ మంచిది.

## 8 అలవాట్లు

మలమూత్ర విసర్జన : మలమూత్రవిసర్జనవిషయంలో శిశువుకు శిక్షణ అవసరం. కాని అతి సున్నితంగా, నెమ్మదిగా ఇవ్వాలి. తనకేదో పనివుందనీ, ఆలస్య మవుతుందనీ తల్లి శిశువును ఆతురతపెట్టకూడదు. సామాన్యంగా శిశువులు స్తన్యపానంచేసినవెంటనే, లేక కొంతసేపటికి మలమూత్ర విసర్జనము చేస్తారు. మొదటినుంచే అనగా కొన్ని నెలల శిశువుకు సంతృప్తిగా స్తన్యపానం చేసినతరువాత ప్రతిపర్యాయము ఒక నిర్దిష్టమైన స్థలంలోకాని, "కమోడ్" మీదకాని (ఇది ఒక

కుర్చీలాగుండి, మధ్య ఒక పింగాణిపాత్ర ఉంటుంది.) కూర్చో పెట్టాలి. ఈవిధంగా చేయుటవల్ల, క్రమేణ నిర్దిష్టకాలంలో నిర్దిష్టస్థానంలో మలవిసర్జనచేయుట బిడ్డకు అలవడుతుంది. కూర్చోబెట్టిన వెంటనే బిడ్డ దొడ్డికిపోనియెడల తల్లి విసుకు చూపెట్టరాదు. కొంతసేపు వేచివుండుట అవసరం. అయితే చాలసేపుదాక అలాగే కూర్చోపెట్టరాదు. శిశువులను పది యేళ్ళ పిల్లవాళ్ళలాగు ప్రవర్తించాలని నిరీక్షించుట అవివేకం. మొగ్గను బలవంతంగా విచ్చులాగుచేసినట్లు అవుతుంది.

సామాన్యంగా కొందరుపిల్లలు దొడ్డికని నిర్ణయించిన చోటుకు తీసుకువెళ్ళగానే తల్లి సూచనను గ్రహించి మలవిసర్జన చేస్తారు. కొందరు అలాచేయరు. అలాంటి శిశువును నిర్బంధించి చేయించుట పొరపాటు. ప్రతివిషయంలోను ఈవిధంగా నిర్బంధపెట్టి బిడ్డలను పెద్దవారివలె ప్రవర్తించేలాగు చేసినచో, వారు చిన్నప్పుడెంత పరిశుభ్రత, క్రమము, మొదలైన అలవాట్లు నేర్చుకొన్నప్పటికీ పెద్దవారైనతరువాత కూడ ప్రతియొక్క విషయంలోను నిర్బంధం అవసరమవుతుంది. అనగా ప్రతిచిన్నవిషయంలోసహితం పెద్దవారి సలహాప్రకారం నడుచుకొంటారేగాని స్వయంగా ఏ కార్యమూ చేయలేరన్న మాట.

కనుక తల్లి శిశువుయొక్క వయస్సునుబట్టి తెలివితేటలతో శిక్షణ ఇవ్వాలి. శిశుమానసికాభివృద్ధికి ఎంతకాలం అవసరమో అంతకాల మిచ్చి, తల్లి తోడ్పడాలిగాని, ఏ విషయంలోను తనుచెప్పినట్టు తూ. చ. తప్పకుండా బిడ్డ వినయ విధేయతలతో నడుచుకోవాలని నిరీక్షించటం చాలపొరపాటు.

భయపెట్టి, నిర్బంధించి బిడ్డ విధేయతతో నడుచుకొనేలాగు చేస్తే బిడ్డలో స్వశక్తి, ప్రయత్నం మున్నగునవి పెరగవు. శక్తిహీనతకు దారితీస్తుందన్నమాట.

మొదటమొదట, శిశువు తల్లి చేసేసూచనల్ని గ్రహించుతూ మలవిసర్జనచేసిననూ, రానురాను పెరిగి నడిచేకాలంలో అంటే రెండుమూడేళ్ళవయస్సులో తల్లిమాట వినరు. నిర్ణీతకాలంలో దొడ్డికి వెళ్ళుటకు నిరాకరిస్తారు. ఇలా నిరాకరించటానికి అనేక కారణాలుంటాయి. పట్టుదల, నిరాకరించు స్వభావం, భయం, కోపం, తమ్మునిమీదనో, చెల్లాయిమీదనో అలుక, అసూయ, ఆశాభంగం మున్నగు మానసిక ప్రవృత్తులవలన నిర్ణీతకాలంలో మలవిసర్జన చేయలేకపోతారు. అనగా శరీరానికీ మానసికతత్వానికీ ఎంత అవినాభావసంబంధమున్నదనే విషయం విదితమవుతుంది. కాబట్టి బిడ్డకు కలిగే కష్టాలను, ప్రతిబంధకాలను తల్లి ఎంతో ఓర్పుతో తొలగించ ప్రయత్నించాలి. విసుగు, కోపం చూపెట్టరాదు. అలా వీలుకానపుడు సూచించి, స్వేచ్ఛగా విడిచిపెట్టుట ఉత్తమం గాని బిడ్డను నిర్బంధించరాదు. క్రమేణ బిడ్డకు తల్లియందు ప్రేమ విశ్వాసాలు పెరిగినకొలది తల్లిసూచనల్ని గ్రహించటం, నేర్చుకోటం మున్నగు గుణాలు పట్టుబడుతాయి.

బొటనవ్రేలు చీకు అలవాటు: కొందరు శిశువులు పుట్టిన కొన్నిరోజులలోనో, నెలల్లోనో బొటనవ్రేలును చీక నారంభించుతారు. మరి కొందరికి ఈ అలవాటే పట్టుపడదు. అయితే ముఖ్యంగా మనదేశంలో, తల్లులు కొందరు అజ్ఞానం వల్ల తమపనులకు అంతరాయంకలగకుండావుండటానికి బిడ్డలు

ఏడవకుండ బిడ్డ నోటిలో వ్రేలు వేసుకొని చీకు అలవాటు చేయించుటకూడ కలదు. పెరిగినతరువాతకూడ వుండి పోతుందని కాని, బిడ్డవ్రేలు పుండుపడి పెరగకుండ సన్నగిలి పోతుందనికాని, నోటిఆకారం చెడిపోతుందనికాని వారెరుగరు. ఇక బిడ్డయొక్క మానసికాభివృద్ధి కుంటుబడుతుందనేవిషయం అసలే ఎరుగరు. విద్యవిజ్ఞానాలున్న తల్లులేమో ఈ అల వాటును తామే చేయరు కాని, కొందరుబిడ్డలే స్వయంగా ఈ అలవాటును చేసుకొనివుంటే అలజడిపడిపోతారు. పైగా ఈ అలవాటును గడ్డుసమస్యగా యెంచుతారు. కాబట్టి వీరు శిశువు కీ అలవాటును తప్పించుటకోసం మోటుతనంతో ప్రయత్నిస్తూ బాధించుతారు. ఇది వీ రనుకొన్నంత గడ్డుసమస్య కాదు; పరిష్కరించరానిది కాదు.

సాధారణంగా బిడ్డ తనకు ఆకలి అయినప్పుడు, స్తన్యం జ్ఞాపకమొచ్చినప్పుడు లేదా నిద్ర వచ్చినపుడు తన వ్రేలును చీకుతుంది. సంతృప్తిగా స్తన్యపానంచేయని సందర్భాలలో, తన వాంఛతీరని సమయాల్లో, లేక చికాకు కలిగినప్పుడు వ్రేలుును చీక నారంభిస్తుంది. తల్లి కారణాల్ని కనుక్కొని ఆదినుంచే ఆపకపోతే అది అలవాటుపడిపోతుంది. కనుక, ఈ అలవాటు ఏ కారణంచేత అలవడింది ? ఆరంభదశలో ఉన్నదా, ముదిరిపోయిందా? ఏ విధంగా తప్పించాలి? అనే విషయాలు తల్లి చక్కగా ఆలోచించి బిడ్డకు సహాయపడాలి. కాని కొట్టటం, బెదరించటం మున్నగు మోటుతనం పనికి రాదు. పైగా హానికరం కూడాను. ఈ అలవాటు కొంద రికేగాని అందరికీ అలవడదు. ఈ కొందరికైనా చాలా

కాలం ఉండదు. అలా ఉన్నదంటే ఏవో బలమైన కారణా లుండాలి. వాటిని తొలగించితే, ఈ అలవాటు తనంతటదే అంత మొందుతుంది.

శిశువు పుట్టిన కొన్ని రోజుల్లోనో, కొన్ని నెలల్లోనో తన బొటనవ్రేలిని నోటబెట్టుకొన నారంభించితే, తల్లి వెంటనే శిశువుచేతులు నోటికందకుండ సదుపాయాలు సున్నితంగా చేయాలి. ఇలా చేయటంలో శిశువు కెంతమాత్రం బాధ, చీకాకు కలగకుండ మెలకువతో చేయాలి.

బిడ్డలందరికి ఒకేవిధమైన స్వభావముండదు. వాళ్ళ చేతుల్ని పట్టుకొంటేకాని, ఏమాత్రం బంధించినట్టు కనిపించితేగాని, కొందరు వెంటనే ఎదిరించుతారు. ఏడుస్తారు. అలాంటిశిశువుల్ని లొంగదీయ యత్నించడం పొరపాటు. బిడ్డ చైతన్యంలేని యంత్రంకాదు. మనలాగు దానికీ మానసిక జీవితమనేది ఉన్నదనే విషయాన్ని పెద్దవాళ్లు విస్మరించ కూడదు. ఈ అలవాటును తప్పించటానికని శిశువు చేతుల్ని ఏదో విధంగా కట్టిపెట్టితే, ముఖ్యంగా ఎదిరించే బిడ్డల విషయంలో, వ్రేలుచీకు అలవాటువల్ల శారీరకంగా కలిగే హాని కన్న ఎక్కువహాని మానసికజీవితానికి కలుగుతుంది. ఎలాగంటే, ఎట్టి అలవాట్లుగాని, నడతగాని కేవలం శారీరకమే గాదు. మానసికతత్వానికి సహితం సంబంధించి వుంటాయి అనే విషయం గ్రహించాలి. కనుక, అలా మన ఇష్టప్రకారం బిడ్డలు నడుచుకోవాలి అని వారిని నిర్బంధించి, బాధించి, లొంగదీసినయడల వారిమానసికాభివృద్ధి కుంటుపడుతుంది. అంతేగాదు, కోపోద్రేకము అధికమవుతూ నరములకు సంబం

ధించినవ్యాధులు సంభవించవచ్చును. కాబట్టి తల్లి శిశువు వ్రేలు చీకు అలవాటును విచక్షణ నుపయోగించి మెలకువతో తప్పించాలి.

శిశువు ఆకలితో అలమటించిపోకుండ జాగ్రత్తగా మెలగాలి. అంటే శిశువు ఆకలి చేపడ్చిన వెంటనే తల్లి స్తన్యమివ్వాలి. ఆకలితీరి సంతృప్తికలిగేదాక ఇవ్వాలి. అప్పుడే బిడ్డ కడుపు నిండ పాలుత్రాగి, ఆకలితీర్చుకొంటూ, తల్లి ప్రేమను గ్రోలి, తన ప్రేమతృష్ణను తృప్తిపరచుకొంటుంది. ఈ విషయాన్ని తల్లి పదిలంగా మనస్సున ఉంచుకొని బిడ్డకు తనతో ఆడుకొనే వాంఛ తనివితీరుదాక, బిడ్డచెంతవుండి ఆడుకోనివ్వాలి.

బిడ్డ నిద్రించబోయే సమయంలో, మేల్కొనే తరుణంలో తల్లి చెంతనేవుండి ఆలన పాలన చేస్తూ ఆడించాలి. ఈవిధంగా తల్లి మొదటినుంచి మెలకువతో మెలగినట్లైతే అసలు ఈ అలవాటు అలవడదు. అలవడినా అతిసులభంగా తప్పించవచ్చును.

బిడ్డకు సంవత్సరంన్నర, రెండేళ్లు అయిన తరువాతకూడ ఈ అలవాటు వుండినయెడల తల్లి బిడ్డఆరోగ్యానికి హాని చేయని మిఠాయిని చీకటానికిచేతబెట్టి ఈ అలవాటును తప్పించాలి. కాని, నిద్రించేటప్పుడుగాని, కునుకుపట్టేటప్పుడుగాని ఇవ్వకూడదు. పూర్తిగా మేల్కొన్న సమయంలోనే ఇవ్వాలన్న మాట.

బిడ్డకు తనచుట్టునున్న పరిసరాలయందు, ఆట పాటలయందు ఆసక్తి అధికమైనకొలది ఈ అలవాటు క్రమక్రమంగా తొలగిపోతుంది.

కాబట్టి బిడ్డ నిద్రనుండి మేల్కొనే సమయంలో తల్లి బిడ్డ దగ్గరనేవుండి లాలించుతూ ఆడుకోవాలి. లేదా, తోటి పిల్లల్ని తీసుకువచ్చి వాళ్ళతో ఆడుకునేలాగు చేయాలి. ఎగిరే పక్షులు, గాలికి అల్లల్లాడే చెట్లఆకులు మున్నగు వాటి వైపు బిడ్డ దృష్టిని మరలించటానికి ప్రయత్నించాలి. రంగు రంగుల కాగితాలతో చేయబడిన ఆటవస్తువుల్ని ఎగరవేయ టమో, ఆటవస్తువులను బిడ్డముందు పడవేసి బిడ్డతోపాటు తనుకూడ ఆడుకోవటమో చేయాలి. పాటపాడటం, చప్పుడు చేసే ఆటవస్తువులను క్రిందపడవేయటం మున్నగు వాటిని చేయాలి. ఈ రీతిగ ఆటపాటలతో బిడ్డగమనాన్ని మరలించ టానికి ప్రయత్నించాలి.

వ్రేలును చీకు అలవాటుగల బిడ్డ నిద్రనుండిమేల్కొం టుండగానే వ్రేలును నోటిలో పెట్టుకొంటుంది అనే విషయం జ్ఞాపకముంచుకొని తప్పనిసరిగ, తల్లి బిడ్డచెంతవుండి, అనేక విధమయిన ఆటపాటలవైపు బిడ్డ గమనాన్ని మరలించి అల వాటును తప్పించాలి. అయితే వ్రేలును నోటబెట్టుకొన్నతరు వాతసైతం, నిర్బంధంగా నివారించకుండ, బిడ్డగమనాన్ని సూక్ష్మంగా ఆటపాటలవైపుకు మరలించటానికి యత్నించాలి.

## 9 పరిసరములు - వాతావరణము

శిశు శరీరపోషణకు, పెరుగుదలకు ఆహార విహారాలు, నిద్ర మున్నగునవి అవసరమైనరీతిగనే శిశు మానసిక వికాసా నికి తగిన పరిసరములు, వాతావరణము అవసరము. అనగా, శిశువుకు మొదటి సంవత్సరములో ఆరోగ్యకరమైన ఆహారం,

శుభ్రమైనగాలి, పరిశుభ్రమైన ప్రదేశం, వెలుతురు, కావలసి నంత నిద్ర ఎంత అవసరమో, దానికి తగిన పరిసరములు, స్వేచ్ఛగా ఆడుకొనటానికి అవకాశం, ఆటవస్తువులు, తల్లిదం డ్రులు, బంధువులయొక్క ఆదరణ, ప్రేమ, సహవాసం అంతే అవసరమన్నమాట.

బిడ్డకు సుమారు ఒక సంవత్సరం ఈడు వచ్చేటప్పటికి తోటిపిల్లల సహవాసం అవసరమవుతుంది. శిశువు ప్రారం భదశలో కొన్ని నెలలవరకు నిద్రలో ఎక్కువకాలం గడిపి నను, మేల్కొన్నప్పుడు పరిసరములను పరికించుట, వాటిని ఆకర్షించుకొని లీనంచేసికోవటం, వాటి సంసర్గంద్వారా మానసిక నిర్మాణ కార్యక్రమం కొనసాగించటం చేసు కొంటూ వుంటుంది. దాదాపు అయిదారు నెలలకే, ఒంట రిగా పడుకొని, ఆనందంగా ఆకాశాన్ని, అల్లలాడే చెట్ల ఆకులను దాపుననే ఎగిరే పక్షులను, తనచేతి, కాళ్ళ వేళ్లను, వీక్షించుతూ, అటునిటు త్రిప్పుతూ, నోటితో వింత వింత శబ్దాలు చేస్తూ ఆడుకొంటుంది. తల్లి తనచెంత వుండాలన్న ఆశ అధికమవుతూ వస్తుంది. ఒక సంవత్సరం నిండేటప్పటికి చుట్టునున్న పరిసరములలో ఆసక్తి అధికమవుతుంది అంతే గాదు, మానవ సహవాసంకోసం తీవ్రమైన వాంఛ కలుగు తుంది. తల్లిదండ్రులు, బంధుజనములు, తోటిపిల్లలు మున్నగు వారియొక్క కంఠధ్వని, మాటలు, కేకలు, నవ్వులు ఆటపా టలు వినటానికెంతో సరదా, వాటిలో పాల్గొనడానికెంతో ఉత్సాహం కలుగుతుంది.

వైద్యశాస్త్రరీత్యా, బిడ్డ ఆరోగ్యమునకు నిశ్శబ్దమైన వాతావరణం, ఎక్కువకాలం నిద్ర (శిశు ప్రారంభదశలో) అవసరమనే విషయం నిజమే, గాని, నవీన ఆరోగ్యశాస్త్ర ప్రకారం తూ. చ. తప్పకుండా అనుచరించాలనే ఆశయంతో విద్యాధికులయిన కొందరు తల్లులు బిడ్డలను గంటలకొలది బిడ్డల కిష్టమున్ననూ లేకున్ననూ ఉయ్యాలలో నిద్రపుచ్చి, లేదా ఒంటరిగా విడిచిపెట్టి తమపనులను చేసుకోటానికో, మరే కార్యంకోసమో వెళ్ళిపోతారు. ఇలా విడిచివెళ్ళిపోతే బిడ్డలు ఏడ్చిఏడ్చి, చివరకు వాళ్ళే మరికొంతకాలం నిద్రపో తారని, తత్ఫలితంగా మరింత ఆరోగ్యం చేకూరుతుందని, తమ కార్యములు నిరాటంకంగా కొనసాగించుకోవచ్చునని అనుకుం టారు. అది పొరబాటు. శిశువే తనకవసరమున్నంతకాలం మాత్రం నిద్రించుతుంది. దానినిద్రకు భంగం కలుగకుండ మాత్రం చూచుకోవాలి. కాని, బలాత్కారముగా నిద్రపు చ్చుట ఎంతో గొప్ప పొరపాటు. శిశువు శరీరంతోపాటు మానసికంగాకూడ వికాసంచెందాలి అన్న విషయం గుర్తించు కోవాలి. ఆరోగ్యంగా పెరగాలన్న ఆశయంతో బిడ్డకవసరం లేకున్న సమయాల్లోసైతం అనేక గంటలకాలం నిద్రపుచ్చిన యెడల, బిడ్డ అన్నివిధాల అభివృద్ధిఅయ్యే అవకాశం కోలు పోతుంది. శిశువుపుట్టిన కొంతకాలంవరకే, తల్లితో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోనే కొన్ని అవకాశాలు తప్ప, తక్కిన అవకాశములు లేకపోతవి. అనగా, తల్లి బిడ్డ కప్పుడప్పుడు స్తన్యమిచ్చుట, స్నానం చేయించుట, ఒడిలోనో, ఉయ్యాల లోనో పడుకోబెట్టి నిద్రపుచ్చుటతప్ప తక్కినవేళలలో బిడ్డను

నిద్రింపజేయుటవలన మానసికవికాసమునకు అవసరమైన అనేక అవకాశాలను బిడ్డకోలుపోతుందన్నమాట.

ఒకఏడాది నిండేటప్పటికీ, తరువాతనుండీ, ఎన్నో విషయాలను నేర్చుకోటం, ఆటవస్తువులతో, తోటిపిల్లలతో ఆడుకోటం, మాటలాడటానికీ, నడవటానికి నేర్చుకోటం మున్నగునవి అవసరంకదా. అందులో ముఖ్యముగా, తోటిపిల్లల సహవాసం, పెద్దవాళ్ళతో సన్నిహిత సంబంధం—ఒక్కమాటలో సంఘజీవితం బిడ్డకెంత అత్యావసరం అను విషయాన్ని తల్లి ఒక్కక్షణంకూడ విస్మరించరాదు.

సంఘజీవితమునకు సిద్ధముగానున్న బిడ్డను, అనగా, చుట్టుప్రక్కలనున్న పిన్నపెద్దలతో పరిచయం, సన్నిహిత సంబంధం, సహవాసం ఏర్పరచుకొనుటకు స్వభావసిద్ధంగా సిద్ధపడుతున్న తరుణములలో బిడ్డను నిద్రపుచ్చుట అనేది బిడ్డ భావిజీవితమునకే ఎంత హానికరము అనే సత్యాన్ని తల్లులు కొందరు యెరుగరు. అందువల్లనే అట్టి తల్లులు శత విధాల ప్రయాసపడి బిడ్డను నిద్రపుచ్చుట ప్రధానకార్యంగా ఎంచుతారు. ఇట్టివారు తమబిడ్డల సర్వతోముఖాభివృద్ధికి అవరోధం కలుగజేయుటయేగాక, వారి భావిజీవితానికే ఎంతో హాని కలుగజేస్తున్నారన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

బిడ్డకు నిద్రరానపుడు బలాత్కారంగా నిద్రపుచ్చటం, మేల్కొన్నప్పుడు ఒంటరిగా ఉయ్యాలలోనో పడకమీదనో పడ వేసి పోవటంవలన బిడ్డలమానసికవికాసానికి, ఆనందదాయకమైన ఆటలు, ఆటచెలికాండ్రు, చుట్టునున్న పిన్నపెద్దల పరిచయం, చెలిమి, వస్తుగ్రహణమునకు అవసర

మైన అవకాశములు మున్నగునవి లేకపోతవి. తత్ఫలితంగా మానసిక వికాసము సక్రమంగా జరగటానికి భంగంకలుగుటే గాక బిడ్డకు కొన్ని దురలవాట్లు అలవడుతాయి. బొటనవ్రేలు చీకటం, దేహాన్ని తఱుచుగా ఊగించుకోటం మున్నగు దురల వాట్లు పట్టుబడుతాయి. తోటిపిల్లలతో, పిన్నపెద్దలతో కలిసి మెలసిఉండు స్వభావంలో (సంఘజీవితం) లోటు ఏర్పడు తుంది. తత్ఫలితంగా బిడ్డకు చీదరించుకోటం, భయపడ టం అనవసరమైనసిగ్గు మొదలగు దుర్గుణాలు పట్టువడుతాయి. బిడ్డ తనదేహాన్ని తరుచుగా ఊగించుకొనేఅలవాటువల్ల మాన సిక సంబంధవ్యాధులు సంభవిస్తాయి. ఈవిషయాల్ని తల్లులు గ్రహించుకొని తమబాధ్యతను తెలివితేటలతో నిర్వహించు కోవాలి.

మరొక ప్రధానవిషయాన్ని మనం తెలిసికొనుట అత్యా వసరం. అనేక ఏళ్ళుగా మనస్తత్వవేత్తలు శిశు మనస్తత్వ శాస్త్రములో అమోఘమైన పరిశోధనలు సల్పిన ఫలితంగా, మరికొన్ని విషయాల్ని ఇటీవలనే కనుక్కొన్నారు. శిశువుకు పుట్టినప్పటినుండియే మానసిక జీవితం అనేది బీజరూపముగా వున్నది. పుట్టిన కొన్ని గంటలనుండియే, శిశువు తనలో నున్న ఒకవిధమైన జ్ఞానతృష్ణ ప్రోద్బలంచే, అంతర్గతంగానున్న వివిధ ప్రవృత్తులు బాహ్య పరిసరముల సంసర్గ సంస్కారముల చేత మానసికనిర్మాణం, మానసికవికాసం కోసం అనుక్షణం అవిచ్ఛిన్నంగా, అవిరామంగా కృషిచేస్తూవుంటుంది. ఈవిధ మయిన శిశు మానసికవికాస చర్యాక్రమములలో, శిశువుకు వివిధ సూక్ష్మగ్రాహ్య దశలు (సూక్ష్మంగా గ్రహించుకొనే

ఒకవిధమైనజ్యోతి ఏర్పడి తద్వారా శక్తుల వికసింపచేసుకోటానికి అనువైన తరుణములు) ఏర్పడుతవి. వాటివాటిధర్మం నెరవేరినవెంటనే అవి అదృశ్యమైపోతాయి. మరల రావు. అలాంటి మానసికవికాసతరుణములలో బిడ్డను నిద్రింపజేయుటవల్లనూ, మరేవిధమైన ఆటంకాలున్నచో వాటిని తొలిగించటానికి యత్నించకపోవుటవల్లనూ, దాని సూక్ష్మగ్రాహ్యదశలలో శిశువుసల్పు నిరంతరకృషికి అవరోధం కలిగించినట్లుఅవుతుంది ఆ దశలు గడిచిపోతవి. వాటికి సంబంధించిన తృష్ణ చల్లారిపోతుంది. బహుముఖమైన మానసిక వికాసం కలుగక, అనేకలోట్లు ఏర్పడుతవి. తత్ఫలితంగానే, బిడ్డలో వయస్సుకు తగిన బుద్ధివికాసం లోపించిపోతుంది. ఈ విషయాలు కొంత విపులంగా మరొకచోట విశదపరచబడియున్నవి.

# తల్లి - బిడ్డ

## రెండవ ప్రకరణము

### 1 అభివృద్ధిక్రమములో వివిధ దశలు

శిశువు జనించిన ఒక్క సంవత్సరం లోపల ఏ విధంగా క్రమాభివృద్ధి చెందుతూ వచ్చిందనే విషయాన్ని కొంతవరకు తెలుసుకొన్నాము. అభివృద్ధి, పెరగటం అనేవి కేవలం శారీరకంగా ఒడ్డు, పొడుగు ఎదుగుట, బలం పెరుగుట అనికాదు! శారీరకంగా నేగాక మానసికంగాకూడ సర్వతోముఖాభివృద్ధి చెందినపుడే బిడ్డ వయస్సుకుతగిన అభివృద్ధి చెందినదన్నమాట. బిడ్డయొక్క ప్రతి ప్రవర్తనలో ఈ అభివృద్ధి పరిమాణం ప్రకటితమవుతుంది. శిశువు జ్ఞానేంద్రియముల ద్వారా, కాళ్లు చేతులు మున్నగు అవయవములద్వారా ఆసక్తి, గ్రహణశక్తి నైపుణ్యం మొదలగునవి వయస్సుకు తగినట్లు ప్రకటితమవుతవి అన్నమాట. ఈ అభివృద్ధి పరిమాణమునకు వయోనుగుణ ప్రమాణం అంటారు.

బిడ్డ పుట్టినప్పటినుండికూడ ఈ అభివృద్ధి పరిమాణం సక్రమంగా జరుగుతున్నదా, లేదా అని ముఖ్యంగా తల్లి సమీక్షించుచుతూ రావాలి. వయస్సుకుతగినట్లుగా సక్రమంగా జరగనియెడల, ఆ లోటుకు కారణమేమి అని చక్కగా ఆలోచించి, అభివృద్ధిక్రమంలో అడ్డుతగులుతున్న ప్రతిబంధకాలను

తొలగించుట అత్యవసరం. లేనిచో బిడ్డ భావిజీవితమునకే తీరనిలోపము సంభవించవచ్చును. అందుచేతనే తల్లికి శిశు మనోవిజ్ఞానవిషయంలో కొంత పరిచయము, పరిజ్ఞానముండుట అవసరం. అంతమాత్రంచేత తల్లి క్రొత్తగ ఎన్నో ప్రమాణ గ్రంథాల్ని అధ్యయనంచేసి విజ్ఞానంపొందాలనికాదు. అల్లా చేయటం అతి ప్రయాసకరం, అసాధ్యంకూడాను. కాని బిడ్డ పుట్టిన క్షణంనుండీ దాని ప్రవర్తనను పరికించి పరిశీలించుట ద్వారా, దాని మానసికప్రవృత్తి, దాని పరిణామమును గురించి కొంత పరిజ్ఞానము పొందవచ్చును. మనకీ పరిజ్ఞానమును ప్రసాదించునది మనబిడ్డయే. అందుచేత మన కడుపున పుట్టిన మనబిడ్డయే మనకు "ప్రథమగురువు"అను విషయాన్ని జ్ఞాపకముంచుకొనుట అవసరం. అటుతరువాతనే, శిశు మనోవిజ్ఞానమును గురించి అవలీలగా అర్థమగులాగున వ్రాయబడిన పుస్తకాలను చదవటంకూడ కొంత అవసరమేను.

అభివృద్ధి క్రమంలో వివిధ దశలు:-

గెసేల్, ఫ్రాన్సస్, బెనేట్, ఇసాక్ మున్నగు మన స్తత్వ శాస్త్రజ్ఞులు శిశువు జనించినప్పటినుండియే వారి మానసికపరిణామమును గురించి, పరిమాణమును గురించీ అనేక నూతన విషయాలను కనుగొన్నారు. మరి కొందరు ఆధునిక మనస్తత్వవేత్తలు శిశువు జననకాలంనుండి 18 ఏళ్ళ ఈడుదాక వారి మానసిక పరిణామమును గురించి ప్రశస్తమైన పరిశోధనలు సల్పిన ఫలితంగా మరికొన్ని ప్రధాన విషయములను కనిపెట్టారు. అవి ఏవనగా: మనుజుని జనన కాలంనుండి 18 ఏళ్ళదాక జరుగుతున్న అభివృద్ధి క్రమములో

విస్పష్టమైన వివిధ అవస్థలున్నాయి. వానిలో ముఖ్యమైనవి మూడు. ఈ ముఖ్యమైన మూడుదశలలో శారీరకంగానేగాక, మానసికంగా సయితం, విస్పష్టమైన విభిన్నమైన పరిణామం, పరిమాణం గోచరిస్తాయి. మరికొంత విపులీకరించటానికి ప్రయత్నిస్తాను.

మొట్టమొదటి దశ. శిశుజననకాలమునుండి 6 ఏండ్ల వరకు
రెండవదశ 6 నుండి 12 ఏండ్ల వరకు
మూడవదశ 12 నుండి 18 ఏండ్ల వరకు.

శిశు జననకాలంనుండి 6 ఏళ్ళదాక దాని మానసిక స్థాయి ఇంచుమించు ఒక్కరీతిగా వుంటుంది అని వారి అభిప్రాయం. కాని ఆవిధంగా లేదు. విస్పష్టమైన వ్యత్యాసము కానరాకున్నను, వస్తుతః జననం నుండి 6 ఏండ్లవరకున్న అవస్థలో, రెండు ఉపదశలున్నవి.
మొదటి ఉపదశ: బిడ్డ పుట్టినప్పటినుండి 3 యేండ్లదాక.
రెండవదశ: 3 నుండి 6 ఏండ్లదాక.

ఈ రెండు ఉపదశలలో విభిన్నమైన మానసికస్థాయి ఉంటుంది. ఈ రెండు ఉపదశలలో బిడ్డలో మహత్తరమైన పరిణామం జరుగుతుంది. ఈ పరిణామం ఏవిధంగా జరుగుతుందను విషయాన్ని విపులంగా తరువాత ఆలోచించుకుందాం. అసలు మన కవసరమయినది ఈ ప్రధానదశయే.

బిడ్డను పాఠశాలకు పంపుటకు అయిదారు ఏళ్ళ వయస్సు తగిన వయస్సు అంటారుకదా. కారణమేమంటే అప్పటికి బిడ్డబుద్ధి వికాసంపొందివుంటున్నదన్నమాట.

రెండవదశ: 6 నుండి 12 ఏండ్ల వరకు

ఈ వయస్సులో బిడ్డ నెమ్మదిగా ప్రశాంతంగా పెరుగుతుంది. ఈ దశలోనే ఆరోగ్యం, బలం మున్నగునవి చక్కగా చేకూరుతాయి. 6 నుండి 12 ఏండ్ల వయస్సులోపల శారీరకంగానేగాక, మానసికంగాకూడా కలుగుతున్న మార్పు చక్కగా కనబడుతుంది. (ఉదా: పాల పండ్లు క్రమంగా వూడిపోయి క్రొత్తపండ్లు మొలుస్తూ వస్తాయి).

మూడవదశ: 12 నుండి 18 ఏండ్లదాక

(1) దీనినికూడ రెండు ఉపదశలుగా విభజించుట అవసరం. 12 నుండి 15 ఏండ్ల వరకు బిడ్డ మనస్థాయి ఒకే తీరున ఉంటుంది.

(2) 15 నుండి 18 ఏండ్ల వరకు ఈదశలోని మనస్థాయి ఒకే విధం.

ఈ రెండు ఉపదశలలో కలిగే మానసిక పరిణామం అద్భుతంగా వుంటుంది. మొట్టమొదటి అవస్థలో జరిగినట్లే ఈ దశలోను అమోఘమైన పరిణామం కలుగుతుంది.

ఈ 18 ఏళ్ళ ఈడులోనే మనుజుని మానసిక జీవితము చక్కగా అభివృద్ధిచెంది, బుద్ధి పూర్తిగా వికసితమైయుంటుందనీ, తత్ఫలితంగానే మనుజుడు సర్వకళాశాల విజ్ఞానమును అవలీలగ పొందగలడనీ, సకలగుణసంపన్నుడగుట కిదియే తరుణమనీ ఆధునిక విజ్ఞానవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

కాని, నిశితంగా పరిశీలించితే, మనుజుని జననకాలం నుండి 6 ఏళ్ళవరకున్న దశయే అత్యంత ప్రధానమైనది. సక్రమంగా, సర్వతోముఖంగా మనస్తత్వం నిర్మితమయ్యే

దశ ఈ ప్రథమదశయే. అలా నిర్మితమైన మనస్తత్వపునాది మీదనే మనుజుని భావి జీవితసౌధం నిర్మితమవుతుంది. ఈ విషయాన్ని తల్లి జ్ఞాపకముంచుకొనుట అత్యావసరం. ఈ విషయాన్ని విపులంగా, విస్పష్టంగా పరిశోధించి ప్రపంచానికి ప్రసాదించినవారిలో సుప్రసిద్ధ శిశు మనస్తత్వవేత్తయగు డాక్టర్ మాంటిస్సోరి ప్రథమురాలు.

## 2 వి కా స ద శ లు

మనుజునిజీవితంలో బాల్యదశ ప్రధానమైనది. అమోఘమైనది. ఈదశలోనే మానవుని మహోత్కృష్టసాధనమైన "బుద్ధి తత్వము" (తెలివి) రూపొందుతుంది. బుద్ధిమాత్రమేగాదు. మానసిక సంబంధమైన సర్వశక్తులు నిర్మితమవుతున్నాయి.

బాల్యదశలో రెండు ఉపదశలున్నాయి. మొదటిది—శిశు జననకాలం నుండి 3 ఏళ్ళవరకు. రెండవది—3 ఏళ్ళ నుండి 6 ఏళ్ళవరకు.

మానవుని జీవితంలో బాల్యదశయే ప్రధానమైతే అంతకన్న ప్రధానమైనది ప్రథమ ఉపదశ. ఈ మొట్టమొదటి ఉపదశలోనే బిడ్డ తన మానవవ్యక్తిత్వమునకు పునాది వేసుకొని, మానవసహజశక్తులన్నిటిని నిర్మించుకుంటుంది. అనగా, బుద్ధితత్వము, మానసిక శక్తులయొక్క నిర్మాణానికి, వికాసమునకూ అత్యంత చులుకుదనంతో అవిరామమైన కృషిని సల్పుతుంది. అందువలననే, ప్రథమ ఉపదశ అత్యంత ప్రధానమని ఆధునిక మనస్తత్వవేత్తలు వెల్లడించారు.

బిడ్డ పుట్టినప్పుడు ఏడ్పుతప్ప మరేవిధమైనచలనములు అంతగా కానరావు. కాళ్లు చేతులాడించటం, ఊపిరి పీల్చటం సహితం చేతకానంత అసహాయస్థితిలో [బహు కొద్ది కాలం] ఉన్నట్టు గోచరిస్తుంది. శూన్యంనుండి బయలుదేరి నట్టుగా బయలుదేరి ఏడాదినిండేటప్పటికి, పరిసరముల పరిచయము, పరిజ్ఞానము— (చేతనాచేతనస్వరూపములను గురించి, అనగా, ఇంటా బయటా వున్న వివిధవస్తువులు, చెట్లు ఆకులు, కుక్క, పిల్లి, పశువు, పక్షి మున్నగునవి)—బంధు జనుల పరిచయప్రేమల నవగతం చేసుకొనేశక్తి ఎంతో అద్భుతంగా అభివృద్ధిచెందుతాయి.

అయితే బిడ్డ శూన్యంనుండి బయలుదేరలేదనీ, అసలు అది అమ్మకడుపులోవున్న కాలంలోనే దానికి మానసికజీవిత మనేది వుండనీ గెసెల్, మాంటిసోరి మున్నగు సుప్రసిద్ధ శిశు మనస్తత్వవేత్తలు ఎంతోకాలం పరిశోధించినఫలితంగా నిశ్చితాభిప్రాయమునకు వచ్చారు. అయితే శిశువు తల్లిగర్భంలో నున్నప్పుడుకాని, జననకాలానికికాని దానికి "మానసిక శక్తులు" వున్నవని కాదు—అనగా కొంతబుద్ధి, జ్ఞాపకశక్తి, సంకల్పశక్తి మున్నగునవి ఉన్నవనికాదు. వీటికన్నిటికీ ఆధారభూతమైనట్టి ఒకవిధమైన మానసికతత్వం అంకురప్రాయంగా వున్నదని భావం. అది నివురుగప్పిన నిప్పులాగు శిశుహృదయంలో దాగివుండి, పుట్టిన కొన్నిఘడియలనుండియే బాహ్యపరిసరపరిస్థితుల సంసర్గంచే ప్రజ్వలిస్తుంది. ప్రజ్వలితమైన ఈ జ్యోతివలననే బుద్ధిని, మానసికశక్తులను బిడ్డ స్వయం

కృషిచేత సృష్టించుకొని వికసింపచేసుకొంటుందని ఆధునిక శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

శిశువు పుట్టిన కొన్నిఘడియలనుండియే తన మానసికశక్తులను సృజించుకొనుట కేవిధంగా కృషిచేస్తుందో పరిశీలించుదాము.

అంత పసిపాపలో బుద్ధినీ, మానసికశక్తులనూ సృజించుకొనునట్టి మహత్తరమైనశక్తిని "గ్రహణశీల మనస్తత్వం" అని సుప్రసిద్ధ శిశుమానసిక శాస్త్రజ్ఞురాలు డాక్టర్ మాంట్సోరి పేర్కొన్నది. దీని మూలకంగానే శిశువు జనించిన కొన్నిఘడియలనుండియే బుద్ధినీ, మానసికశక్తులను నిర్మించుకోటానికి అతిచురుకుగా అవిచ్ఛిన్నమైన కృషి సల్పుటకు ప్రారంభిస్తుంది. అయితే ఈ నిర్మాణ కార్యకలాపం స్పష్టచైతన్యంతో జరగదు; (ఎఱుకతో) అస్పష్టచైతన్యంతో కొనసాగించుతుంది.

శిశువు తన "గ్రహణశీల మనస్తత్వం"మూలకంగా పరిసర స్వరూపములను, పరిస్థితులను జ్ఞానేంద్రియములద్వారా (అనగా చక్షురింద్రియము, శ్రవణేంద్రియము, ఘ్రాణేంద్రియము, స్పర్శేంద్రియము, రసనేంద్రియము) వీటిలో మొదట కొన్నిటిద్వారా, తరువాత తక్కినవాటిద్వారా ఆకర్షించుకొని తనలో లీనంచేసుకొంటుంది. తదనుసారంగా మనస్సు పరివర్తనమొందుతూపోతుంది. అన్నిటినీ ఒకేమారు ఆకర్షించుకోదు. అనుక్షణం తనశక్తులను నిర్మించుకొనుచున్న శిశువు తన కెప్పు డెంత అవసరమో అంతమాత్రమే ఆకర్షించుకొం

టుంది. ఏవి అవసరమో వాటినిమాత్రమే పరిగ్రహించుకొంటుంది. పరిసర స్వరూపములు, పరిస్థితులను ఆకర్షించుకొనటంలో ఎంతఅవసరం, ఏవిఅవసరం అను విషయాన్ని నిర్ణయించుకొనే శక్తి శిశువులోనే అంతర్గతంగా వున్నది. ఎలాగంటే—

శిశుహృదయంలో ఒకవిధమైన ఇంద్రియబోధ లేక ఇంద్రియగోచరత అనేది వున్నది. అది అప్పుడప్పుడు పరిసరముల సంసర్గమువలన జ్యోతిలాగు వెలుగుతుంది. బిడ్డ హృదయం ఆవేశపూరితమైపోతుంది. దీనిని అతి తీవ్రమైన తృష్ణతో పోల్చవచ్చును. కాబట్టి, దీనిని "జ్ఞానతృష్ణ" అని పేర్కొందాము. ఈవిధమైన జ్ఞానతృష్ణ కలుగుతూండగానే బిడ్డ అత్యంత ఉద్వేగంతో జ్ఞానేంద్రియముద్వారా పరిసర పరిస్థితులను తన సృష్టికార్యమునకు అవసరమైనవాటిని ఆకర్షించుకొని తన తృష్ణను తృప్తిపరచుకొంటుంది. అనగా, మొదట తృష్ణ కలగటం, దాని ప్రేరణద్వారా పరిసరస్వరూపమును ఆకర్షించుకోటం, వాటిలో తను లీనమైపోవటం, లేక మనస్సు ఆ స్వరూపంలాగు పరివర్తనచెందటం- ఈ రెండుకార్యముల సమ్మేళనఫలితంగా దాని బుద్ధీ, మానసికశక్తులూ నిర్మితమవుతాయి.

ఈవిధంగా "ఇంద్రియబోధ" (లేక ఇంద్రియగోచరత) అనేది బిడ్డ మానసికశక్తులన్నీ నిర్మాణమయ్యేదాక అప్పుడప్పుడు ఉద్భవించుతుంది. ఆవిధంగా కలిగే దశకే సూక్ష్మగ్రాహ్యకాలమంటారు. ఈదశలలోనే, క్రమక్రమంగా బిడ్డ తన బుద్ధినీ, తక్కిన మానసిక శక్తులను సృష్టించుకొంటుంది.

ఈవిధమైన మనస్తత్వం పెద్దవాళ్లకుండదు. ఈ గ్రహణశీల మనస్తత్వమునకున్న శక్తి అమోఘం, అసమానం. ఇట్టి శక్తిచేతనే బిడ్డ తన యావజ్జీవితమును సృష్టించుకొంటుంది. అనగా శారీరకంగా ప్రతిచలనమునూ, మానసికంగా మానవ సహజశక్తులను నిర్మించుకొంటుందన్నమాట. వీటె వన్నిటిని ఆహ్లాదంగా ఆడుకుంటూ, అవ్యక్తచైతన్యంతో అనుక్షణం నిర్మించుకుంటూపోతుంది.

శిశువు తల్లిగర్భంనుండి బాహ్యప్రపంచంలో ప్రవేశించటం, కొంతకాలం తల్లిమీద అనుక్షణం ఆధారపడివుండటము, క్రమక్రమంగా ప్రాకటం, దోగాడటం, నడవటం, స్వేచ్ఛగా అటునిటు తిరగటం, చుట్టిరావటం, చేతుల నుపయోగించి ఏవోపనులు చేసుకోవటం, చక్కనిభాష నలవరచుకోటం, పిన్న పెద్దల చెలిమి సంపాదించుకోటం, ఆనందంగా ఆడుకోటం, ఇవన్నీ బిడ్డకు వినోదక్రీడలే! ఈవిధమైన క్రీడల మూలకంగా తన మానసికశక్తులను, బుద్ధిని నిర్మించుకోటం అనేది ఎంత అబ్బురమైన విషయం!

బిడ్డ పుట్టిన కొన్ని ఘడియలకే కదలటం, ఏడ్వటం, ఊపిరినిపీల్చటం మున్నగు చలనములు కలుగుతవి. అవి ప్రారంభమయినపుడే బిడ్డలోనున్న గ్రహణశీలమనస్తత్వం పరిసరపరిస్థితులను ఆకర్షించుకోటం ప్రారంభమవుతుంది. ఈ మనస్తత్వమునకు సంబంధించిన సూక్ష్మగ్రాహ్యదశలు ప్రారంభమవుతవి. ఈ దశలలోనే బిడ్డ తన బుద్ధితత్వము నిర్మించుకోటానికి అత్యంత అద్భుతంగా ప్రవర్తిస్తుంది. పరిసర

ముల నన్వేషించుటలో వివిధ చెట్లు, చేమలు, పువ్వులు, పశు పక్షి మృగాదులు, వివిధవస్తువులు వున్నప్పటికీ, ఆ ప్రత్యేక సూక్ష్మగ్రాహ్యదశలో అవి అవసరం లేనియెడల ఎవ రెంత నిర్బంధించిననూ బిడ్డదృష్టి వాటివైపుకు ఆకర్షింపబడదు. తన సృష్టికార్యమునకు అవసరమయితే నేలమీదప్రాకు అత్యల్ప ప్రాణులగు చీమలు, క్రిమి కీటకాదులు, పువ్వు, ఆకు, అతి సూక్ష్మమైన ఇసుకరేణువు మున్నగు పదార్థాలు బిడ్డదృష్టి నాకర్షిస్తాయి. అనగా అలాంటి అతి సూక్ష్మవస్తువులను ఆకర్షించుకోటానికి ప్రత్యేకమైన సూక్ష్మగ్రాహ్యదశ ఆవిర్భ వించినదను విషయం తేటతెల్లం.

## 3 పొందుపరచుకొనుట

ప్రకృతి యేర్పరచిన ప్రత్యేకమైన సూక్ష్మగ్రాహ్య తరుణములలో బిడ్డ తన గ్రహణశీల మనస్తత్వం మూలకంగా పరిసరపరిస్థితుల సంసర్గంచేత తన బుద్ధినీ, మానసిక శక్తు లను సృష్టించుకొని తాను జన్మించిన దేశ, కాల, పరిసర ములకు, పరిస్థితులకు అనుగుణ్యంగా పొందుపరచుకొనేశక్తిని సంపాదించుతుంది. అనగా, తను పుట్టిన కుటుంబం, సంఘం, దేశంయొక్క భాష, సంస్కృతి, ఆచార సాంప్రదాయాలు మున్నగునవి తనలో భాగమయిపోతవి. ఈవిధంగా పొందు పరచుకొనే శక్తికే "ఆవరణానుగుణ్యాత" అంటారు.

బిడ్డ సాధించుకొనే ప్రతి లక్ష్యమున కనుగుణ్యాంగా ప్రత్యేకమైన సూక్ష్మగ్రాహ్యదశ ఏర్పడటం, ఆ లక్ష్యమును సాధించిన వెంటనే అది అంతరించిపోవటం, మరొకలక్ష్యాన్ని

బిడ్డ సాధించటానికోసం తదనుగుణ్యాదశ ఏర్పడడం జరుగుతూఉం టుంది. అనగా, బిడ్డయొక్క సర్వశక్తులు నిర్మాణమగు వరకు ఈవిధంగా ఉద్భవిస్తూ, అంతరించుతూ వుంటాయి. ఒకసారి ఉద్భవించి అంతరించిన సూక్ష్మగ్రాహ్యదశ మరల రాదు. అలాంటి తరుణములో బిడ్డ సాధించే లక్ష్యమున కవసరమైన అవకాశం లేనియెడల, తిరిగి ఆ లక్ష్యమును సాధించటం అత్యంత ప్రయాసకరమైన విషయం. ఈ ప్రత్యేక సూక్ష్మగ్రాహ్య దశలలో బిడ్డ సాధించే లక్ష్యములు అనేకము లున్నవి.

బాహ్యప్రపంచ పరిసరములు పరిస్థితుల కనుగుణ్యంగా పొందుపరచుకోటం బిడ్డ జననకాలంనుండియే జరుగుతుంది. తల్లిని గుర్తించుకోటం, తన అంగములను, అవయవములను గుర్తించుకోటం, (ముఖ్యంగా చేతులు కాళ్ళు) తన చుట్టూ మాట్లాడేవాళ్ల నోటిని, పెదిమలను తదేకధ్యానంతో వీక్షించుచూ, తన పెదిమలను కదలించుతూ, తన కంఠనాళము లను తర్ఫీదుచేసుకొనటం, పరిసర స్వరూపములను, బంధు మిత్రులను గుర్తించటం మొదలగునవి అయిదారు నెలల యీడులోనే జరుగుతుంటవి. మరొక ముఖ్యవిషయ మేమంటే, పరిసరములలోని వస్తువులు వాటివాటి స్థానే వుండటాన్ని బిడ్డ గ్రహించివుంటుంది. అవి వాటి స్థానే లేకుండా, మరెక్కడైనా వుండటాన్ని బిడ్డ పరికించినట్లైతే వెంటనే దానికొకవిధమైన అతృప్తి, ఆందోళనకలిగి కొన్ని వేళలయందు అస్వస్థత కూడ ఏర్పడుతుంది. అదేవిధంగా ప్రతిక్షణం తనకు పాలిచ్చి, లాలించి,పాలించు తల్లి కనబడకపోతే, తల్లికిమారుగ మరెవ

రైనా తన్ను ఎత్తుకోటం, పాలివ్వటం, స్నానం చేయించటం సంభవిస్తే బిడ్డకు కలతకలిగి అస్వస్థత ఏర్పడడంకద్దు. ఇందువల్ల విదితమయ్యేదేమంటే, అనుక్షణం బిడ్డసంసర్గం, సన్నిహిత సంబంధం ఏర్పరచుకొంటున్న వస్తువులు, తల్లి ఆ యా స్థానాల్లో లేకపోతే తదనుభూతితో మానసిక జీవితాన్ని నిర్మించుకొనేకృషికి భంగం వాటిల్లుతుంది. ఇది బిడ్డ ఓర్చు కోజాలదు.

ఈ ఆరునెలల ఈడుకే అస్పష్టంగా ఉచ్ఛరించుటకు ప్రయత్నించుచూ అవ్యక్తమైన మధుర శబ్దాలు చేస్తుంది. ఇంతవరకూ ప్రాకుతూ, దోగాడుతూవున్న బిడ్డ కూర్చో టానికి ప్రయత్నిస్తుంది. వస్తువులను చేతులతో పట్టుకొం టుంది. వస్తువులను చేతులతో పట్టుకొని పరిశీలించటంతో బుద్ధితత్వ మతి చురుకుగా నిర్మింపబడుతున్న దన్నమాట. దాదాపు ఎనిమిది తొమ్మిది నెలల మధ్య కాళ్ళు చేతుల మీద నడుస్తూ, పెద్దవాళ్ళ సహాయంతో మరిదేనినైనా ఆధారంచేసుకొని కాళ్ళమీద నిలుచోటానికి ప్రయత్నిస్తుంది. కాళ్ళు భూమిమీద మోపటం నేర్చుకొంటుంది. ఏడాదినిండే టప్పటికి కాళ్ళు భూమిమీదమోపి నడవటం (సహాయంతో) ప్రారంభించుతుంది. ఏడాదిమీద మూడునెలలకల్లా చక్కగా నడవటాన్ని సాధించుతుంది. చేతుల నుపయోగించి ఏవో పనులను చేయుటకు ప్రారంభిస్తుంది. ఈ తరుణంలోనే బుద్ధి మరింత చురుకుగా, చక్కగా, నిర్మాణమవుతుందన్నమాట. బిడ్డ చేతుల నుపయోగించటానికి బుద్ధి నిర్మాణ వికాసము లకూ అంత సంబంధమున్నది.

ఈవిధంగా రెండేళ్ళు నిండేటప్పటికి, బిడ్డ యెన్నో కార్యములను సాధించటం, పరిచయంచేసుకోటం తాను అనుభూతిద్వారా తనశక్తులన్నిటినీ నిర్మించుకోటం చేస్తుంది. ఇంతవరకూ అస్పష్టచైతన్యంతో, అసమానమైన మనస్తత్వం మూలకంగా, తత్సంబంధమైన సూక్ష్మగ్రాహ్యదశలద్వారా తన బుద్ధినీ, మానసికశక్తులనూ నిర్మించుకొని, అవయవములను స్వాధీనపరచుకొన్నది. ఇప్పుడు స్వేచ్ఛగా తిరిగి తన కార్యమును చేసుకోటానికి కౌశలమును పొందటానికి ప్రయత్నిస్తుంది. అనగా ఇప్పుడు బిడ్డలో స్పష్టచైతన్యం ఏర్పడుచున్నది. మూడేళ్ళనాటికి మరింత కార్యకౌశలమును సంపాదించుతుంది.

కాబట్టి, తల్లి శిశువుజననకాలంనుండి మూడు సంవత్సరములవరకు అతి జాగ్రత్తగా బిడ్డకు తోడ్పడుట అవసరం. అనగా, బిడ్డయొక్క ప్రతి అభివృద్ధిక్రమంలో దానికి తగిన పరిసరములు పరిస్థితులు లభించుటకు ప్రయాసపడాలి. బిడ్డకు తోడ్పడాలను ఉద్దేశంతో చీటికీ మాటికీ అనవసరంగా బిడ్డయొక్క స్వేచ్ఛకూ, స్వయంకృషికీ అడ్డుతగలకూడదు.

బిడ్డయొక్క సర్వతోముఖాభివృద్ధికివలయు పరిసరములు పరిస్థితులు లభించులాగు ప్రయాసపడాలన్నమాత్రంచేత, తన ఆర్థికస్థితికి అందుబాటులోలేని పరిసర పరిస్థితులను నిర్మించవలెననుట కాదు. లేక, ఆర్థికపరిస్థితి ప్రశస్తంగా వున్నదని బిడ్డవున్న గదులను కేవలం అలంకరించటం, అనవసరమైన అనేక ఆటవస్తువులను అమర్చటం అనికూడ కాదు. బిడ్డ ధనికులయింట పుట్టనీ, దరిద్రులయింటపుట్టనీ, దానికి అవసర

మైన పరిసరములు, పరిస్థితులు ఈ ప్రపంచమే — బిడ్డ జన్మిం చిన ఇల్లు, ఇరుగు పొరుగు. బిడ్డ తన సర్వతోముఖాభివృద్ధికి, స్వయంకృషి సల్పుచున్నప్పుడు, ఆ యా నిర్మాణదశలు వికాసదశలలో తల్లి విజ్ఞాన విచక్షణలతో తోడ్పడటం అత్యవసరం. ఇందువల్ల స్పష్టమయ్యేదేమంటే, బిడ్డ పోషణ, శిక్షణల బాధ్యతను భరించవలసినది తల్లియే. శిశువు తల్లి గర్భంలో నున్నప్పు డేవిధంగా తల్లిలో ఒకభాగంగా వుందో, బాహ్యప్రపంచంలో ప్రవేశించిన తరువాతకూడ తల్లిలో ఒక భాగంగానే కొంతకాలముంటుంది. మాతా శిశువుల కంత సంబంధ బాంధవ్యము లున్నవి.

ఈ విధంగా తల్లిచెంత బిడ్డ పెరగటంవలన, బిడ్డ మానసికశక్తులు, బుద్ధి నిర్మాణమునకూ, వికాసమునకూ అత్యవసరమైన తల్లి అనురాగం, సన్నిహితసంబంధం, ఆమె కార్యకలాపములయొక్క పరిచయం, అనుభూతి, మున్నగు నవి బిడ్డకు లభ్యమవుతాయి. కాబట్టి తల్లి సాధ్యమైనంత కాలం బిడ్డను తనవద్ద వుంచుకోవాలి. అనగా, తల్లి పనిచేసు కొనే తరుణములో (ఇంటా బయటా)ను, బంధుమిత్రులతో సంభాషించునపుడు, ఇరుగింటికి పొరుగింటికి వెళ్లునపుడు బంధు మిత్రులఇండ్లకు వెళ్ళునపుడు, విందు వినోదాలలో పాల్గొను నపుడు, బజారు కెళ్ళునపుడు బిడ్డను, తల్లి తనచెంత వుంచు కోవాలి. ఈ విధంగా తల్లివద్ద బిడ్డవున్నందుచేత వివిధ పరి సరములను పరికించి పరిశీలించు అవకాశము కలుగుతుంది. పెద్దవాళ్లు మాట్లాడునపుడు వారుచ్చరించు శబ్దాలను, వారు కదిలించు పెదిమలను, వాళ్ల భాషావైఖరిని వీక్షించటానికి,

తగిన వయస్సురాక, శరీర నిర్మాణము పూర్తికానప్పుడు—బలాత్కారపఱచి బిడ్డను పై జెప్పిన వాటిని నేర్పుటకు ప్రయత్నించుటచేత, బిడ్డకు తీరనిలోటు శారీరకంగా, మానసికంగా ఏర్పడుతుంది. దీనినికొంత విపులంగా పరిశీలించుదాము.

బిడ్డ నడవటం అనే లక్ష్యాన్ని సాధించటమనేది అత్యంత అమోఘమైన విజయం. ఈ పరిస్థితిలో, బిడ్డ రెండవ పర్యాయము పరాధీనమునుండి విముక్తి చెందుతున్నది. (మొదటి విముక్తి తల్లిగర్భంనుండి బాహ్య ప్రపంచమునకు వచ్చుట.) బిడ్డ రెండుకాళ్ళమీద నిలువుగా నిలచుటకుకాని, నడచుటకుకాని మెదడు, వెనుపాము, శిరోవంశనాడులు (Brain, Spinal Cord, Cerebro Spinal Nerves) పూర్తిగా నిర్మాణమయి వుండాలి. ఇది మరి కొంత విపులపరుస్తాను:—

1. మెదడులో రెండు భాగములున్నవికదా: చిన మెదడు, పెనుమెదడు అంటారు. (Cerebellum and Cerebrum) అనుమస్తిష్కము, మస్తిష్కము. చిఱుమెదడు బిడ్డకు ఆరునెలల ఈడునుండి, పదునాలుగు లేక పదునైదు నెలల వయస్సువరకు అతిచుఱుకుగా అభివృద్ధిచెందుతుంది. తరువాత వాటి అభివృద్ధివేగము క్రమక్రమంగా తగ్గుతూ, బిడ్డకు 4½ సం॥ల వయస్సువఱకు మందగమనముతో సాగిపోతుంది. కాళ్ళమీద నిలువుగా నిలబడగలశక్తి చిఱుమెదడుయొక్క అభివృద్ధిమీద ఆధారపడుతుంది.

2. వెనుపాముకు (మజ్జ) సంబంధించిన కొన్ని నరములు చక్కగా నిర్మాణము కావాలి. చిన్న మెదడునుండి బయలుదేరు ఎట్టి సందేశముకాని (Messag ) ఈ వెనుపాముకు

సంబంధించిన నాడులద్వారానే కండరములకు అందుతుంది. (దీనికి పృష్ఠవంశ నాడి అని పేరు.)

3. అస్థిపంజరము పూర్తిగ నిర్మాణము కావాలి. ముఖ్యంగా తలపుర్రె (కపాలము Cradnium), పాదములు చక్కగా నిర్మాణమై యుండాలి. (పుట్టినపుడు బిడ్డ పుర్రె ఎముకలన్నీ ఒక్కటిగా చేరియుండవు.) ఇవి పూర్తిగా నిర్మాణ మయినపుడే, బిడ్డ క్రిందపడినను దానికెట్టి ప్రమాదము సంభ వించదు; చక్కగా నిలబడి నడవగలదు. సామాన్యంగా బిడ్డకు 15 నెలలు ఈడు వచ్చినపుడే ఇవియన్నియు చక్కగ నిర్మింపబడివుంటాయి. ఈవిధంగా, ఇవి అన్నియు సంపూ ర్తిగా చక్కగా నిర్మాణమగువఱకు బిడ్డ నిలబడుటకు ప్రయత్నించటం, క్రిందపడటం, తిరిగి నిలవటం, పడటం ఈ రీతిగా పెక్కు పర్యాయములు చేస్తూ, చివరకు నడవటం అను లక్ష్యాన్ని స్వయంకృషితో సాధించుతుంది.

కనుక, ముఖ్యంగా తల్లి రెండు విషయములను జ్ఞాపక ముంచుకొనుట అత్యవసరము.

ఒకటి—పైనజెప్పిన శారీరక సంబంధమైన నిర్మాణము అనగా—మెదడు, వెనుపాము శిరోవంశనాడులు, అస్థిపంజ రము మున్నగునవి—సంపూర్తికాకముందే బిడ్డ కూర్చొను టకు కాని, నిలుచుండుటకుకాని, నడచుటకుకాని సాధ్యము కాదు. బిడ్డను బలాత్కారపఱచి అలా చేయించటానికి ప్రయ త్నించుట ప్రమాదకరము. ఆవిధంగా చేయించినట్లైతే, బిడ్డ

యొక్క అంగముల నిర్మాణంలో లోటు ఏర్పడుతుంది. అంగ సౌష్టవము చెడుతుంది.

రెండు — స్వేచ్ఛగా, స్వయంకృషితో నేర్చుకొంటున్న బిడ్డకు అడ్డు తగులుటవలనను, బిడ్డ త్వరగా నేర్చుకొనవలెనను కోరిక చేత, "శిక్షణ" పేరిట బిడ్డను నిర్బంధించి నేర్పుటచేతను మానసికంగాకూడ బిడ్డకు కీడు కలుగుతుందే కాని మేలు కాదు. అనగా, బిడ్డయొక్క అనుభూతి పరిజ్ఞానముల సముపార్జనకూ, వివేక వికాసమునకు అడ్డు తగులుట అన్నమాటే.

అదేరీతిగ నడచుటకు పరుగెత్తుటకు ప్రయత్నిస్తున్న బిడ్డను పరుగెత్తకుండ, ఎక్కువగ నడవకుండా (అలసిపోతుందను ఆదుర్దాతో) అవరోధించుట చాల పొరపాటు. (ఆవిధంగా అభ్యంతరపరచుట అంత సులభసాధ్యంకూడ కాదు.) అంగ నిర్మాణము పూర్తికాగానే సహజసిద్ధంగా బిడ్డ వాటిని ప్రయోగించుతుంది. బిడ్డ ఈవిధంగా తన అంగములను ఉపయోగపెట్టుట ద్వారా బలము, లాఘవము, నేర్పును సంపాదించుకుంటుంది. ఇది సహజసిద్ధము.

III

అదేవిధంగా బిడ్డ మాట్లాడుశక్తిని సాధించటమనేది మరొక మహత్తరమైన విజయం. స్వాతంత్ర్య సోపానములలో మరొక మెట్టు ఎక్కటన్నమాట. "నడచుట" అను లక్ష్యమును సాధించిన బిడ్డ ఏవిధంగా తన చుట్టునున్న పరిసరములతో సంసర్గ సంస్కారములను పొందుతున్నదో అదేరీతిగా, భాష మూలకంగా తన వాంఛలను, భావములను వెలిబుచ్చుతూ, తోడి మానవులతో (పిన్న పెద్దలతో) సన్నిహిత సంబంధముల నేర్పఱచుకొంటుంది. బిడ్డ ఉచ్చరించుటను

ప్రారంభించగానే, అది ఏవో అవ్యక్త ధ్వనులు చేయటం, అస్పష్టముగ శబ్దముల నుచ్చరించటం, ఒకటి రెండు శబ్దములు చేరిన పదములను పలకటం, రెండు మూడు పదములను చేర్చి మాట్లాడటం, ఈ విధంగా చక్కగా మాట్లాడుటను సాధించు వఱకు అమోఘమైన, అవిరామమైన కృషి సల్పుతుంది! వొద్దస్తమానం వాగుతూ వుంటుంది. అట్టి తరుణములో తల్లి బిడ్డ కవరోధం కల్పించక, స్వేచ్ఛగా వాగటాని కవకాశ మివ్వాలి. తల్లులు కొందఱు విసుగుతో, బిడ్డ వాగకుండ ఆప టానికి ప్రయత్నించుతారు. అసలు ఆపట మనేది అంత సులభ సాధ్యంకాదు. పైగా భయపెట్టి, అభ్యంతరపెట్టుటచేత బిడ్డ ఉచ్చారణలో, భాషలో లోపము ఏర్పడుతుంది. బిడ్డ వెలి బుచ్చు వాంఛలకు, భావములకు అవరోధము ఏర్పడుటచేత, కొన్ని సమయాల్లో "నత్తి" కూడ ఏర్పడుటకు వీలున్నది. అంతేకాదు. బిడ్డ అనుభూతికీ, పరిజ్ఞాన సంపాదనకూ కొద్దో గొప్పో అవరోధం కలుగుటకు అవకాశ మేర్పడుతుంది.

సాధారణంగా బిడ్డకు రెండేళ్ళు నిండుకాలంలో అది తల్లిమీద ఆధారపడకుండా స్వయంగా తన పనులను చేసి కొనుటకు అభిలాష ఆసక్తులను వెలిబుచ్చుతుంది. ఎవరి సహాయ మపేక్షించకుండా దుస్తులను తొడుగుకొనటానికి, విప్పటానికీ, అన్నము తన చేతితో తీసికొని నోటపెట్టుకోటా నికీ, ఇంకను పెక్కుపనులను స్వయంగా చేయటానికి కృషి చేస్తుంది. ఇట్టి స్వయం కృషిలో పెక్కు పర్యాయములు తప్పి పోయినప్పటికీ, తుదకు సాధించితీరుతుంది. ఈవిధమైన బిడ్డ స్వయంకృషి, స్వేచ్ఛలకు ప్రతిబంధకములు కల్పించినయెడల

బిడ్డ అత్యంత పట్టుదలతో ప్రతిఘటించుతుంది. కాని, కొందఱు బిడ్డలు మాత్రము తమ స్వేచ్ఛ, స్వయంకృషులను అవరోధించు పరిస్థితులను (అనగా—తల్లి లేక మఱెవరుగాని బిడ్డకు సర్వము తామే చేయటం, లేక ఏదో విధంగా అడ్డు తగలటం) ప్రారంభదశలో పట్టుదలతో ప్రతిఘటించినను, క్రమక్రమంగా వారి పట్టుదల సడలిపోతూ తుదకు అట్టి నిర్బంధ పరిస్థితులకు లొంగిపోవుట కలదు. ఈరీతిగ లొంగిపోయిన బిడ్డలు అత్యంత వినయ విధేయతలుగల బిడ్డలని అనేకులు భావించుట కలదు. ఇది గొప్ప పొరపాటు. (కొందఱు ఈ విధంగా లొంగిపోవుటకు కారణము లనేకములు. వాటిలో కొన్ని కారణాలు: అనారోగ్యము, వయోనుగుణ్య పరిణామం లేకపోవుట, వాతావరణం పరిస్థితుల ప్రభావం మున్నగునవి.) ఈవిధముగ లొంగిపోయి తూ. చ. తప్పకుండ తల్లి అజ్ఞానుసారం మెలగునట్టి బిడ్డ స్వతంత్రించి స్వయంగా ఏ కార్యమును గాని చేయజాలదు. అనుక్షణం తల్లిమీద ఆధారపడి యుంటుంది. తత్ఫలితముగ అనుభూతికి లోటు ఏర్పడి బుద్ధి వికాసం పొందదు. శక్తి సామర్థ్యములు, నైపుణ్యం మున్నగునవి వయస్సుకు తగినట్టుగ వికాసము పొందవు. కొన్ని సందర్భములలో—(తల్లి అజ్ఞానంవలన) ఇట్టి బిడ్డలు పెరిగి పెద్దవారైనపుడు మందమతులగుటకు కూడ అవకాశమేర్పడుతుంది. మఱికొందఱు బిడ్డలు ప్రారంభంలోనేగాక చాలాకాలము వఱకు ప్రతిబంధకములను అనేక పర్యాయములు ప్రతిఘటించుతారు. ఇంకను కొందఱు ఎప్పటికీ ప్రతిఘటించుట కలదు; ఆ విధంగా అనేక పర్యాయములు ప్రతిఘటించిన ఫలితముగా, తమ సహజవాంఛలు నెరవేరనందున, మానసిక సంబంధ

వ్యాధులకు బిడ్డలు గురిఅవుతారు. (అనగా నరములకు సంబంధించిన వ్యాధులు సంభవించుతవి) పైగా, ఇట్టి బిడ్డలకు మంకుపట్టు, మందబుద్ధి, చిలిపితనము పట్టుబడుతాయి; కాబట్టి, తల్లి ఏవిధంగాను బిడ్డస్వయంకృషికి అవరోధము కల్పించక దానిలక్ష్యసిద్ధి కెలా సహాయపడాలో ఆలోచించుదాము.

ఎంత చురుకుదనము, సూక్ష్మబుద్ధి గల బిడ్డయైనాసరే–సాధారణంగా రెండున్నర సంవత్సరముల ఈడు వచ్చేవరకు ఇతరుల సహాయము లేకుండ స్వయంగా దుస్తులను తొడుకొనుట కష్టసాధ్యమైన విషయమే! కాబట్టి, బిడ్డచేయు స్వయంకృషికి అడ్డుతగలకుండ మొదటినుండీ, చొక్కా తొడుగుట కనువుగానుండునట్లు బిడ్డ చేతులను చాచులాగున ప్రోత్సహించినట్లైతే బిడ్డ అలా చేస్తుంది. అదేరీతిగ లాగును తొడుగుటకు కాళ్ళ నందిస్తుంది; క్రమేణ స్వయంగా తొడుకొనుటకు ప్రయత్నిస్తుంది. తల్లి అతి మెలకువతో బిడ్డయే స్వయంగా దుస్తులను తొడుక్కొనేటట్లు తోడ్పడుతూ, తన సహాయ మావంతకూడ లేక బిడ్డడే స్వయంగా తొడుక్కొన్నట్లు నటించాలి. అదేవిధంగా బిడ్డ అన్నము తనచేతితో తీసుకొని నోటపెట్టుకొనుటకు ప్రయత్నిస్తుంది. (రెండేళ్లు పూర్తిగా నిండకమునుపే ఈ కోరికను వెలిబుచ్చుతుంది) అలా చేయుటానికి సంపూర్ణ స్వేచ్ఛ నివ్వాలి. ప్రారంభంలో అన్నం క్రింద చిందిపోతుంది; కారణం బిడ్డ వ్రేళ్ళతో అన్నం తీసుకో జాలదు. తన చేతిని అన్నంమీద పెట్టటం, పూర్తి చేతితో అన్నము తీసుకొని నోటబెట్టుకోటంవల్ల అన్నం క్రింద చిందిపోతుంది. క్రమేణ అన్నం క్రిందచిందకుండ చక్కగా వ్రేళ్ళతో

తీసుకొని నోటబెట్టుకొనుట నేర్చుకొంటుంది. (అనగా-మొదట చేతి నుపయోగించటం రానురాను నేర్పును సంపాదించటం). ఇట్టి తరుణములలో తల్లి బిడ్డకు స్వయంకృషికి అవకాశమిస్తూ దానికి తోడ్పడాలి. అనగా, బిడ్డచేతిలో అన్నంపెట్టి, క్రింద చిందకుండ నోటిలో పెట్టుకొనేలాగు అతి మెళుకువతో బిడ్డ కెలుక లేకుండా తోడ్పడాలి. కాని, బిడ్డ ప్రతిఘటించినచో దాని ఇచ్ఛప్రకారం చేయనివ్వాలి. కొంతసేపు దాని స్వయం కృషికి అవకాశమిచ్చి మరొకసారి అన్నం దాని చేతబెట్టి, నోట పెట్టుకొనేలాగు సహాయపడాలి. అది ప్రతిఘటించక పోయినయెడల ఒక పర్యాయం బిడ్డయే అన్నం తీసుకొని, నోట పెట్టుకొనేలాగు (చిందిపోయినను సరే), మరొక పర్యాయం తల్లియే బిడ్డచేతిలో పెట్టి చక్కగా నోటపెట్టుకొనేటట్లు చేస్తూ, ఇదొక ఆటయని బిడ్డ భావించునట్లు తల్లి నేర్పుతో నేర్పాలి. ఇంటిలో అన్నలు, అక్కలు వున్నయెడల బిడ్డ వారిని పరికించుతూ వారిని అనుకరించుటలో అతిత్వరగా నేర్పును సంపాదించుతుంది.

మఱొక విషయం తల్లి జ్ఞాపకముంచుకొనుట అవసరము. బిడ్డయొక్క అన్నం గిన్నెకాని, కంచము కాని, విశాలంగా, కొద్దిగా పల్లముగా వుండాలి. అలా వుంటేనే బిడ్డ తన వ్రేళ్ళతో అన్నం తీసుకోటానికి అనువుగా వుంటుంది. క్రింద చిందటాని కంత ఆస్పదముండదు. అదేరీతిగా, బిడ్డ పాలు కాని, నీళ్లుకాని త్రాగువిషయంలో, తనచేతులతో చక్కగా పట్టుకొని త్రాగటానికి అనువుగా వుండునట్టి చిన్న చెంబును ఇవ్వాలి.

బిడ్డకు తోడ్పడువిషయంలోనైతేనేమి, దానికిచ్చు వస్తువులవిషయంలో నైతేనేమి, తల్లి రెండు ముఖ్యవిషయములను జ్ఞాపకముంచుకొనుట అత్యవసరము.

ఒకటి:— బిడ్డయొక్క స్వాతంత్రమునకు, స్వయంకృషికి అవరోధము కల్పించకుండ అత్యంత మెళుకువతో మెలగుట.

రెండు:— బిడ్డ ఉపయోగించు వస్తువులు అది నేర్చుకొనుట కనువుగా వుండునట్లు ఏర్పరచుట.

ఇందువలన, తెలిసదేమంటే, ఏణ్ణర్థమునుండి (1½ సం॥) రెండేళ్లు వి౦డులోపల అనేక లక్ష్యములను సాధించుట కొఱకు అనుక్షణం స్వాతంత్రంగా స్వయంకృషి సల్పుతుంది; స్వాతంత్రము, స్వయంకృషి అనేవి జన్మతో వచ్చినవి. అనగా సహజవాంఛలు. ప్రతి లక్ష్యసిద్ధికై పట్టుదలతో కృషి సల్పుతుంది. (ఇదిగూడ సహజగుణము. స్వయంకృషి సల్పుతున్న బిడ్డకు అవరోధము కలిగించుటో, లేక అనవసరముగ తోడ్పడుటో చేసినయెడల సామాన్యంగా బిడ్డలందరు (కొందరు తప్ప) ప్రతిఘటించుతారు. అట్టివారిని నిర్బంధించి నేర్పుటకు ప్రయత్నించినచో ఆవేశము ఆగ్రహము వెలిబుచ్చుతూ, తుదకు ఆక్రందనచేస్తూ బాధపడిపోతారు. బిడ్డకు కలుగు నిస్సహాయస్థితి, దుఃఖము అనేవి బిడ్డకెంతో బాధాకరంగా ఉంటాయి. మన వ్యవహార ప్రపంచములో మన వాంఛలను, భావములకు, కార్యసాధనలకు ప్రతిబంధకాలు కలిగినప్పుడు మన కట్టి కోపావేశము, నిరాశ, నిస్పృహ, నిస్సహాయతలు

కలిగి బాధపడుతామో అదేరీతిగ బిడ్డ బాధపడుతుందను విష యము అవగాహనచేసుకోవాలి. పెద్దవారి ప్రపంచము పెద్ద వారి కెంత వాస్తవమో బిడ్డలప్రపంచము బిడ్డలకంతే వాస్తవ మైనది అను యదార్థమును గ్రహించుట అత్యవసరము. అట్టి భావోద్రేకముల వలన బిడ్డకు దైహికంగా మానసికంగా వ్యాధులు సంభవించుతాయనే విషయాన్ని విస్మరించరాదు.

## 6 అవస్థాంతరదశలో పరిణామము

బిడ్డకు రెండేళ్ళు నిండునప్పటికి నడక, మాటలు, పరి సర పరిస్థితుల పరిచయము, బంధుమిత్రులయందు స్నేహము, ప్రేమ మున్నగునవి కొంతవరకు పట్టుబడివుంటాయి. ఇంకా విపులంగా:—కండరములు, జ్ఞానవాహక, గతివాహక నాడులు, మెదడు కొంతవరకు అభివృద్ధియై వుంటాయి. జ్ఞానేంద్రియముల ద్వారా కలుగు భావనలు అనుభూతికి వచ్చియుంటవి (అనగా, చర్మము, చెవి, నాలుక, ముక్కు, కన్ను ప్రత్యేక జ్ఞానేంద్రియములు, శరీరంలో ఇంద్రియ జ్ఞాన మును కలిగించునట్టి కండరములు, కీళ్ళు మున్నగు సాధారణ జ్ఞానేంద్రియములు—వీటి మూలకంగా స్పర్శ, శబ్దం, రుచి, వాసన, రూపము మొదలగు భావనలు.) ఒక్కొక్క జ్ఞానేంద్రి యము ఒక్కొక్క ప్రేరణవశమవుతుంది. చర్మం మూలంగా స్పర్శ, నొప్పి, వేడిమి, ఒత్తిడి; చెవి మూలంగా ధ్వని; నాలుక మూలంగా రుచి; ముక్కు మూలంగా వాసనలు (క్రమేణ వివిధ వాసనలు) ; కన్ను మూలంగా వెలుతురు, రంగు, ఆకారము, దూరము, లోతు మొదలగు భావనలను గ్రహించి తత్సంబంధ అనుభూతిని కొంతవరకు పొందియుం

టుంది. వీటి నన్నిటినీ బిడ్డ ప్రకృతి ప్రసాదితమైన "గ్రహణశీల మన స్తత్వం" ద్వారా, ఒక్కొక్క లక్ష్యసిద్ధికై ఏర్పడు అయా సూక్ష్మగ్రాహ్య దశలో పరిగ్రహించుకొంటూ, దైహికంగా మానసికంగా, అనగా, సర్వావయవములు, నడక, మాటలు, బుద్ధి మొదలగువాటిని నిర్మించుకొంటుంది. రెండేళ్ళు దాటిన తరువాత తన ఆటపాటలలో, పనులలో నైపుణ్యమును సాధించుతూ బుద్ధిని వికసింపజేసుకొంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే సహజసిద్ధమైన స్వశక్తి, స్వయంకృషి, స్వేచ్ఛలతో పరిసర పరిస్థితుల సహాయమును పొందుతూ, దైహిక మానసిక నిర్మాణముల వికాసమును పొందుతుందన్నమాట.

అయితే, బిడ్డకు రెండేళ్లు నిండి మూడేళ్లు పూర్తియగు వరకు కలుగు మార్పులు స్పష్టంగా, (స్థూలంగా) కనుపించక పోవచ్చును. కాని, సూక్ష్మంగా పరిశీలించిన యెడల, ఆ ఒక్క సంవత్సరకాలంలో బిడ్డ మహత్తరమైన పరిణామాలను పొందటం చక్కగ విదితమవుతుంది. పైజెప్పిన నిర్మాణ కార్యకలాపమంతా బిడ్డ అస్పష్ట చేతనస్థితిలో చేసుకొంటుంది. ముఖ్యంగా 2½ సం॥ల వయస్సునుండి కొంత అస్పష్ట చైతన్యంతో, కొంత స్పష్టచైతన్యంతో నిర్మించుకొంటూ, నిర్మితమైన వాటి ప్రయోగము ద్వారా నైపుణ్యమును సంపాదించుకొంటూ బుద్ధిని వికసింపజేసుకొంటుంది. మరొకవిధంగా చెప్పాలంటే;—బిడ్డ అస్పష్ట చేతఃస్థితినుండి, చేతనస్థితికి క్రమక్రమంగా అనగా— ఒక్కొక్క అడుగుపెట్టుతూ మూడేళ్లు నిండునప్పటికి చాల వరకు చేతనస్థితిలో స్థిమితంగా నిలబడిపోతుంది. "2½ సం॥ల నుండి 3 వరకున్న మధ్యకాలములో బిడ్డ అనేక పరిణామము

లను పొందుతుంది. కాబట్టి, ఈ అంతరకాలమందు అవస్థాంతర దశయని పేర్కొనవచ్చును.

### అవస్థాంతరదశలో పరిణామాలు—

ఈ అవస్థాంతరదశలో బిడ్డ ప్రవర్తనలో అస్థిరత్వము, పరస్పరవైరుధ్యములు వ్యక్తమవుతుంటాయి. బిడ్డ ఒకప్పు డెంతో ఉత్సాహంగా, చురుకుగా ఆడుతూ ఉంటుంది; స్వయంగా తన పనులు చేసుకోటం, ఏదో ఒక పనిలో మగ్నమైయుండటం కనుపించుతుంది. ఇంకొక సమయంలో అలసట వెలిబుచ్చుతుంది; ఏదో పరధ్యానంలో వుండి, కదలక మెదలక మొద్దులా కూర్చుండిపోతుంది; ఒకప్పుడు తన ఆట సామాను, ఆటలు, పాటలు మున్నగువాటియందు ఎంతో అభిలాష, ఆసక్తి వెలిబుచ్చుతుంది. ఇంకొకప్పుడు వాటి యందు అయిష్టం చూపుతుంది. తల్లి ఏదైనా సూచించితే చాలు, అతి ఉల్లాసంగా, శ్రద్ధగా ఆ పనిని చేస్తుంది; ఇంకొకప్పుడు జంతువులను, పక్షులను, ఇతర పిల్లలను, పెద్ద లను అనుకరించుతూ ఆనందిస్తుంది. మరొకప్పుడు చీదరించు కొంటుంది.

రెండు ఆటవస్తువులలో ఏదో ఒకదాన్ని యేర్పరచుకొన వలసిన సందర్భమేర్పడినపుడు, తన కేది ఇష్టమో నిశ్చయించుకో జాలదు. కాబట్టి, తఱచుగా రెంటినీ తీసుకోటానికి యత్ని స్తుంది. మోసుకుపోజాలనంతటి బరువైనవిగా వుంటే క్రింద పడవేస్తుందేకాని, ఒకసామానుతో తృప్తి చెందదు. ఇట్టి మాన సిక స్థితినిచూచి, లోభత్వం, మూర్ఖపుపట్టు అనుకోటం పొర పాటు. (ఏర్పరచుకొను శక్తి స్థిరపడదు. అనగా అంత బుద్ధి

వికాసం కాలేదన్నమాట. అదేరీతిగా ఏవస్తువునుగాని కొన్ని సమయాల్లో చక్కగా పట్టుకొంటుంది. నీళ్ళచెంబు, పాలగిన్నె మున్నగువాటిని, క్రిందచిందకుండ ఎంతో జాగ్రత్తగా పట్టుకొంటుంది. త్రాగుతుంది. కొన్ని వేళలలో క్రింద పడవేస్తుంది.

## ఆహారం—నిద్ర—విహారం

ఈ వయస్సు బిడ్డకు ఆకలి ఒకేవిధంగా వుండదు. ఒకప్పుడు బాగా ఆకలి వేస్తుంది; చక్కగాకూర్చొని, గిన్నెలో నుండి అన్నంతీసుకొని ఆకలి తీరేదాక తింటుంది. ఒక్కొక్కప్పుడలా తినదు. ఆకలివుండదు. కారణం స్థిరబుద్ధి లేదన్నమాటే. ఎలాగంటే, ఒకప్పుడేమో అలసిపోవువరకు గంతులువేయటం, పరుగెత్తటం, అక్కడక్కడ విహరించటం, ఆటలాడటం చేస్తుంది. మరొకప్పుడు అలా చేయదు. అట్టి సందర్భంలో ఆకలి వుండదు. అంచేత, కుదురుగా పళ్ళెం వద్ద కూర్చుని అన్నంతినదు. అది కావాలి, ఇది వద్దు అంటూ పారవేయటం, పరుగెత్తటం, నీళ్ళను క్రింద ఒలకబోయటం మున్నగు చిలిపితనమును వెలిబుచ్చుతుంది. ఒకప్పుడు ఎంతో మక్కువగాతినిన తినుబండారమును మరొక సమయంలో ఏవగించుకొంటుంది. సాధారణంగా ఈ వయస్సు బిడ్డకు వెన్న, పాలు, మీగడతో చేసిన తీపి పదార్థాలు (అలాగని, అమితంగా పంచదార నుపయోగించరాదు.) పళ్ళు, కొన్నిదుంపలు, గ్రుడ్లు ఇత్యాదులు ఇష్టం. ఆకు కూరలు అయిష్టం. ముఖ్యంగా తల్లి గమనింపవలసినదేమంటే, బిడ్డ ఆకలి అయినప్పుడు, తనకిష్టమైన ఆహారాన్ని కుదురుగా కూర్చొని ఎవరిసహాయమపేక్షించక నే పుచ్చుకొంటుంది. కాని,

ఆకలిఉన్ననూ, కొన్ని సమయాల్లో తనతల్లి తినిపించాలని కూడ కోరుతుంది. (ఇది మనోస్థితి అన్నమాట) కొన్ని సమయాల్లో ఆహారం పుచ్చుకోటానికి రమ్మని తల్లి పిలవగానే బిడ్డ పరుగెత్తు కొని వస్తుంది; కొన్ని సందర్భాలలో అలారాదు. అలాంటప్పుడు బిడ్డను నిర్బంధించరాదు. బిడ్డకిష్టమైన ఆహారపదార్థములు పెట్టి, వాటిపేర్లను చెబుతూ "నీవు భోజనం చేసి రా, ఇక్కడ నీళ్లు మిఠాయి (బిడ్డకిష్టమైనవి) తిందువుగాని" అని చెప్పి స్వేచ్ఛగా వదలి వెళ్లాలి. మొదటనే చిరుతిండి తినాలని బిడ్డ పట్టుపట్టినట్లైతే, తల్లి గమనమివ్వకుండ వెళ్ళిపోవాలి. వేయెందుకు? ఆనాడు ఆ క్షణంలో బిడ్డయొక్క దైహికమానసిక స్థితినిబట్టి, ప్రవర్తనలో మార్పునుబట్టి తల్లి తెలివితేటలతో మెలగాలన్నమాట.

నిద్ర—

ఈ వయస్సు బిడ్డయొక్క నిద్ర విషయం ఒక్కరీతిగా నుండదు. కొన్నిరోజులు అత్యంతాసక్తితో అలసిపోవుదాక ఆడటం, చుఱుకుదనంకలిగి ఏదో ఒకపని చేస్తూవుండటం చేస్తుంది. అలాంటప్పుడు అలసి మధ్యాహ్నం కొంతసేపు నిద్రించుతుంది. అలా అలసిపోకనో, లేదా, ఏవో ఆటలు, వినోదాలు మొదలగువాటియందున్న అభిలాష ఆసక్తివల్లనో కొన్నిరోజులు మధ్యాహ్నం నిద్రపోదు. అదేవిధంగా, కొన్ని రోజులు రాత్రిళ్ళు 7, 8 గంటలకే నిద్రించుతుంది. ఒక్కొక్క నాడు అలా నిద్రించక పక్కమీదపడుకుని, తనలో తాను మాట్లాడుకోడం, పాటలుపాడటం (విన్న పాటలను వల్లించటం, తల్లినో తండ్రినో, ఆలకించమని ఏవో ముచ్చట్లు చెప్పటం చేస్తుంటుంది. తల్లి బిడ్డయొక్క ఇట్టి ప్రవర్తనను,

మానసిక పరిణామమును అవగాహనచేసుకొని తదనుగుణంగా ప్రవర్తించాలి. అలాచేయక బిడ్డను నిర్బంధించి, కొట్టి, తిట్టి, భయపెట్టి నిద్రపుచ్చరాదు. ఆవిధంగా నిర్బంధించి నిద్ర పుచ్చుటవలన బిడ్డకేర్పడిన నూత్నాగ్రాహ్యాదశలో సాధింపవల సిన లక్ష్యమునకూ, నైపుణ్యమునకూ—ఒక్కమాటలో బుద్ధి వికాసమునకు అవరోధమును కల్పించుటన్నమాటే. ఈ విష యాన్ని చక్కగా ఎఱిగి తల్లి అత్యంత మెలకువతో మెలగాలి. సాధారణంగా ఈ వయస్సు బిడ్డలు దినమునకు 12 గంటల సేపు నిద్రపోవుట కలదు. (పగలు, రాత్రి కలసి) అయితే అందరూ అంతకాలము నిద్రపోతారనుటకు వీలులేదు. పగలు చాలాసేపు నిద్రించినబిడ్డ రాత్రి త్వరగా నిద్రపోదు. ఉదయం సుమారు 8 గంటలకు మేల్కొంటుంది. పగలంతా నిద్రిం చని బిడ్డ రాత్రి త్వరగా—7 లేక 8గంటలు— నిద్రించు తుంది; అట్టి సందర్భంలో తెల్లగ తెల్లవారకముందే మేల్కొని, బొమ్మలు పిడతలతో పక్కమీదనే (మంచమున కందుబా టులో వుండాలన్నమాట) కొంతసేపు ఆడుకొంటుంది. ఈ విషయాల్లో తల్లి సమయోచితంగా వర్తించాలి. రాత్రి 10 లేక 12 గంటల కొకమాటు బిడ్డను తీసుకువెళ్లి మూత్రవిసర్జన చేయించుట మంచిది. నిరాకరించితే నిర్బంధించరాదు. మరొ కప్పుడు ప్రయత్నించాలి.

కొందరు బిడ్డలు ఉదయం లేచునపుడే ఏడుస్తూలేస్తారు. అనారోగ్యం కారణమైతే తల్లి వెంటనే బిడ్డవద్దకు వెళ్ళి లాలించి దాని కవసరమైనవాటి నిచ్చి ఓదార్చాలి. అలా ఏడవటానికి కారణమే లేనిచో, బిడ్డగదికి వెళ్ళరాదు; ఆఏడుపు

అంతా ఆగినప్పుడే వెళ్ళాలి. అప్పుడుకూడ ఆ గదిలో ఏవో వస్తువులను చక్కబెట్టినట్లు నటించుతూ, అమ్మా అని బిడ్డ పిలిచినపుడుమాత్రమే వెళ్ళాలి.

మల-మూత్ర విసర్జన

ఈ వయస్సు బిడ్డ సాధారణంగా రోజుకు ఒకటి రెండు పర్యాయాలు మలవిసర్జన చేయుట కలదు. కాని, అప్పుడప్పుడు ఒకటి రెండు రోజులదాక దొడ్డికిపోదు. తల్లి అప్పుడప్పుడు సలహాఇచ్చుట మంచిది. రెండు రోజులకన్న ఎక్కువకాలం దొడ్డికిపోకపోతే, ఏ పళ్ళరసమో ఇచ్చి దానికవసరమైన చికిత్సచేయాలి. కొందరు బిడ్డలు తమంతతామే దొడ్డికివెళ్ళి వచ్చి చెప్పుట కలదు. స్వయంగావెళ్ళి దొడ్డిలో కూర్చొని రావటం కొందరికిష్టం. అయితే కొన్ని సమయాల్లో తల్లి సహాయాన్ని కోరుతారు. లేదా కొంటితనంతో ఉన్నచోటనే కూర్చుంటారు. వీరిమనఃస్థితినెఱిగి క్రమక్రమముగా బిడ్డ, దొడ్డికి వెళ్ళి కూర్చుండులాగున శిక్షణఇవ్వాలి. కొందరు పడుకొన్నట్లుగానో, నిలుచున్నట్లుగానో మలవిసర్జన చేస్తారు. అట్టి బిడ్డల విషయంలో తల్లి బిడ్డను వెంటనే దొడ్డికి తీసుకువెళ్ళాలి. లేదా నీళ్ళ గదిలో ఒక కాగితంవేసి దానిపై కూర్చుండబెట్టాలి. ఈవిధంగా చేసినట్లైతే ఒక నిర్ణీతస్థలంలో దొడ్డికి కూర్చోవాలన్న విషయాన్ని బిడ్డ క్రమంగా నేర్చుకొంటుంది. మూత్రవిసర్జన విషయంలో, ఈ వయస్సు బిడ్డలు తఱచుగా నిర్ణీతస్థలానికే వెళ్ళివస్తారు. అయితే, వీరి మలమూత్ర విసర్జనకు దుస్తులు అడ్డురాకుండా వుండాలన్న విషయం తల్లి గుర్తించాలి. కొందరు ముందుగా చెబుతారు. వెళ్ళమని

తల్లి చెప్పుట ఇట్టి బిడ్డలకు కొంతకాలం అవసరమన్న మాట. ఇంటిలోని పెద్దలు నిర్ణీతస్థలానికి వెళ్ళుట, ఇంటివద్ద పశువులు జంతువులు విసర్జించటం బిడ్డ వీక్షించటం కలదు.

స్నానం, దుస్తులు

సామాన్యంగా ఈ వయస్సు బిడ్డలు, స్నానంచేయటానికి (ఉదయం) ఇష్టపడుతారు. తమంతటతామే చేయలేకపోయి నను నీళ్ళగదిలో చిన్న చెంబుతోనో, గిన్నెతోనో నీళ్ళు ముంచటం, క్రిందపోయటం, తనమీద పోసుకోటం, కొళాయి త్రిప్పటం, సబ్బుతో బొజ్జరుద్దుకోటం, చేతులకు రాచుకొని నురుగు వచ్చువరకు రుద్దడం మొదలగునవిచేస్తూ ఆడుకోటమంటె అమితఇష్టం. ఇదొక క్రీడ అన్నమాట.

ఇంక దుస్తుల విషయం — ఈ ఈడు బిడ్డ తన దుస్తులను స్వయంగా సులభంగా విప్పుకొంటుంది. కాని తొడుక్కోటంలో మాత్రం—ముఖ్యంగా లాగు, చొక్కా తొడుక్కోటం కొంత కష్టసాధ్యమే. తల్లి, తన సలహానిచ్చి, అవసరమైతే సహాయంచేసి బిడ్డలకు నేర్పాలి కాని, తల్లియే తొడుగుతానంటే మాత్రం బిడ్డ నిరాకరించుతుంది. ఒక్కొక్కప్పుడు సహాయాన్నికూడా తీసుకోదు. అట్టి సమయంలో తల్లి సలహాఇచ్చి బిడ్డకు తెలియకుండ కొద్దిగ తోడ్పడి, దుస్తులు తొడగాలన్నమాట. కాని, ఈ విషయాల్లోకూడ బిడ్డ ఒక్కొక్కప్పుడు స్వయంగా దుస్తులను తొడుక్కోదు. తల్లినే తొడగమంటుంది. ఎంతమాత్రం స్వప్రయత్నమన్నమాట చూపదు. పసిబిడ్డలాగు ప్రవర్తిస్తుంది. తను ఒక బొమ్మ అనీ, చిన్నపాప అనీ అంటూ, పూర్తిగా తల్లిమీద ఆధార

పడుతుంది. ఇదొక మానసికపరిణామం అని తల్లి గుర్తించి విచక్షణతో మెలగాలి కాని, విచారపడకూడదు. ఇట్టి మనోస్థితి ఒకటి రెండురోజుల్లో మరిగిపోతుంది. ఈ వయస్సులోనే, బిడ్డ ఒక్కొక్కమాటు అనువుగా దుస్తులు తొడుక్కోటం, ఒక్కొక్కసారి తల్లికి దొరకకుండాతప్పించుకొని పారిపోవటం, తల్లి పట్టుకున్నట్టయితే, విడిపించుకొని పారిపోవటం చేస్తుం టుంది. ఇదొక వినోదం. నిర్బంధించితే దానికెక్కడలేనికోపం. ఏడుపు వస్తుంది. కాబట్టి, తల్లి "నీ కిష్టమైనపుడు వచ్చి స్నానం చేసి బట్టలువేసుకో" అని చెప్పి వెళ్ళిపోవాలి. అనగా బిడ్డ యొక్క స్వేచ్ఛకు, వినోదానికి అవకాశ మిచ్చినట్టయితే, బిడ్డయే తల్లివద్దకువచ్చి, చక్కగా దుస్తులుతొడుక్కుంటుంది. బిడ్డయొక్క ప్రవర్తన, పరిణామము ననుసరించి తల్లి వర్తించా లన్నమాట.

## 7 గమనము-చలనములయొక్క విలువ

రెండున్నర సంవత్సరముల వయస్సులో బిడ్డ చక్కగా నడువగలదు. మేడ మెట్లు నెక్కి దిగుట, కుర్చీ, బల్ల,అరు గుల మీద ఎక్కి దిగుట, ఎత్తైన ప్రదేశంమీద నుండి దుముకుట మున్నగునవి అలవడుతవి. రెండున్నర నుండి మూడేళ్ళు నిండులోపల, వీటిలో నేర్పు, అవయవ పటు త్వము సాధించుటకు అవిరామకృషి సల్పుతుంది; వేగంగా మేడమెట్లు ఎక్కటం, గబగబ దిగటం, అరుగు మీద ఎక్కి క్రిందికి దుముకుట, దాగుడుమూతలు మొదలగు ఆటల నెప ముతో చేతికి చిక్కక పరుగెత్తటం మున్నగునవి చేయుట యందు అత్యాసక్తి వెలిబుచ్చుతుంది. నేలమీద గీచినసున్నం

గీతమీద, అరుగుల ఓరలోను నడచుట, రెండుచేతులతో పైన దేనినైన పట్టుకొని వ్రేలాడుట, ఊయలను స్వంతంగా ఊపుకొనుట మున్నగు ఆటలు అమిత ఇష్టం. ఇట్టి ఆటలలో అనేక పర్యాయములు తప్పి క్రింద పడుట, లేచుట, తిరిగీ పడుట—లేచుట చేస్తూ అరుగు అంచులలో చక్కగా నడచుట, ఊయల ఊచుకొనుట, వ్రేలాడుట నేర్చుకొంటుంది. ఇదే రీతిగ కుర్చీ, బల్లలు, పాత్రసామాను మొదలగు కొంత బరువైన వస్తువులను తన చేతనైతే మోసుకొని, లేదా ఈడ్చుకొంటూ ఒకచోటునుంచి తీసుకువెళ్ళి మరొకచోట పెట్టటం, తిరిగీ వాటిని వాటిస్థానాల్లో చేర్చటం అనేది ఈ ఈడు బిడ్డకు అత్యంత ఆహ్లాదకరమైన ఆట. ఒక చెంబునుండి ఇంకొక చెంబులోకి నీళ్ళు పోయటం, గంగాళంలోనుండి నీళ్ళు చెంబుతో, గిన్నెతో ముంచి క్రింద పారబోయటం, లేదా మోసుకొని వెళ్ళి మరెక్కడనో పారబోసి రావటం, తన పాలను చల్లార్చు నిమిత్తం ఒక గిన్నెనుండి ఇంకొక గిన్నెలోకి పోయటం ఈ విధంగా విసుకు విరామమన్నమాట లేక అనేక పర్యాయములు చేస్తుంది. ఇట్టి ఆటలలో అనేకమార్లు బిడ్డ నీళ్ళుకాని, పాలు కాని క్రింద వలకబోయటం, గిన్నెనో, పాత్రనో జారవిడవటం, అవి పగిలిపోవటం సాధారణంగా జరుగుట పరిపాటి. అట్టి సందర్భములలో బిడ్డ వేరొకగిన్నె, పాత్రలను తెచ్చుకొని తిరిగి తన ఆటను ఆరంభించుతుంది. అయితే, ఈమారు మెలకువతో పట్టుకొని తన పనిని సాగించుటకు ప్రయత్నిస్తుంది. (జారవిడవకుండా) ఈవిధంగా పదేపదే చేస్తూ చివరికి తన లక్ష్యమును

సాధించితీరుతుంది. ఇట్లు చేయుటవలన బిడ్డకేర్పడు శక్తులు ముఖ్యంగా రెండు విధములని చెప్పవచ్చును:—

ఒకటి:-దైహికం. అనగా, కండరములు, ఎముకలు పెరిగి బలపడుతవి. తత్ఫలితంగా అవయవపటుత్వము ఏర్పడుతుంది. బిడ్డ తన దేహమును చక్కగా స్వాధీనంచేసుకొంటూ, నేర్పును సంపాదించుకొంటుంది.

రెండు:-బుద్ధివికాసము. క్రొత్త విషయములను కనుగొనుటకు యత్నించుట, కారణమును కనుగొనుట కాలోచించుట, అవగాహనముచేసికొనుట. సంక్షిప్తంగా: పరిసర పరిస్థితుల పరిజ్ఞానము పొందుతూ, పొందుపరచుకొను శక్తిని సంపాదించుతుంది.

కాబట్టి, తల్లి ఈ వయస్సున బిడ్డకేర్పడు ఇట్టి సూక్ష్మగ్రాహ్యదశలో గమనము చలనములకు సంబంధించిన ప్రేరిత చేష్టలను, వాటి ఫలితంగా బిడ్డకు కలుగనున్న శక్తులను అవగతంచేసుకొని తోడ్పడుట అత్యావసరము. ఎలాగంటే, సామాను విరిగిపోతుందనో, ఇల్లు మురికియైపోతుందనో, తన ఇంటిపనుల కభ్యంతర మేర్పడుతుందనో లోభత్వము, ఆతురత, విసుకు మొదలైనవి వెలిబుచ్చరాదు; ఎంతమాత్రం ముఖంలో చీకాకు కనపరచరాదు. ఇంతమాత్రమే కాదు, నిర్మాణయుక్తమైన సలహా ఇచ్చి సానుభూతితో సహాయపడాలి. బిడ్డ నీళ్ళలో ఆడుకొను తరుణములో చెట్లకు నీళ్ళు పోయులాగున సూచించాలి. పగిలిపోయిన గాజుముక్కలను—బిడ్డ తన ఆటలతో సంతృప్తిచెందిన తరువాత—ఏరి బుట్టలో వేయటానికి, క్రింద ఒలకబోసిన నీటిని గుడ్డతో తుడవటానికీ,

చిందరవందరగా పడవేసిన వస్తువులను యథాప్రకారముగ వాటి స్థానాల్లో చేర్చటానికీ తనకు తోడ్పడమని అర్థించుతూ అదొక ఆటగా బిడ్డ అనుకొనులాగున తల్లి వర్తించాలి. ఏ విధంగా పాలను చల్లార్చాలో, నీళ్ళ నేవిధంగా తోడాలో చూపెట్టుతూ బిడ్డను ఆవిధంగా చేయనివ్వాలి.

బిడ్డ స్వేచ్ఛగా ఆడుటకు, నడయాడుటకు అవకాశము లేనట్టి చోట్లలో—అపరిచితుల ఇండ్లు, రైళ్ళు, సభలు, నాటకాలు, సినిమాలు మున్నగుచోట్ల-బిడియంచేత, ఇరుకుగా నున్నందుచేత, నిర్బంధంచేత గంటల కొలది కదలక మెదలక ఒక మొద్దువలె కూర్చొని వుండటమనేది పసిబిడ్డ కెంత బాధాకరమో తల్లి ఊహించుకొనుట ఎంతైనా అవసరము కదా; భరించరాని అట్టి బాధలవల్లనే బిడ్డ ఏదో ఒక సాకు పేరట చిలిపితనం చేయుటో, మంకుపట్టు పట్టుటో గుక్క విడువకుండ ఏడ్చుటో చేస్తూవుంటుంది. బిడ్డ స్వేచ్ఛగా తిరుగుటకు అవరోధం కలిగినందున దానికి కలుగు బాధలను, గ్రహించలేని తల్లి బిడ్డ చేత మిఠాయినిపెట్టి బుజ్జగించి ఊరడించటానికి యత్నిస్తుంది; తన యత్నం విఫలమైతే భయపెట్టటం, తుదకు బాదటం కూడా చేస్తుంది. కాని ఇట్టి నయభయాదులకన్న బిడ్డకేప్పుడు ప్రేరిత చేష్టలు బలవత్తరమైనవను విషయం విస్మరించరాదు. ఒకవేళ నిర్బధించి లొంగదీసినట్లైతే బిడ్డఅభివృద్ధి కవరోధము కలుగుటేగాక అనేకవిధములయిన కీడుకూడ సంభవిస్తుంది. ఇంతమాత్రంచేత బిడ్డను బంధుమిత్రుల ఇండ్లకు, క్రొత్తచోట్లకు తీసుకొని పోరాదని తలచరాదు. అయితే బిడ్డ బిడియమును పోగొట్టుటకు, కొంత

త్మైన స్వేచ్ఛగా కదలుటకు అవకాశము కలిగించి, ఇష్టమైన ఆటను ఆడు పరిస్థితిని కల్పించాలి. కాని, నాటకాలు సినిమాల విషయంలో మాత్రం తల్లి తన బిడ్డను వెంటబెట్టుకొనిపోవుట అత్యంత అనుచితమైన కార్యమని చెప్పక తప్పదు. ముఖ్యంగా మనదేశంలో తల్లులు కొందరు — అజ్ఞానంచేతనైతేనేమి, అనుకూల పరిస్థితులు లేనందువల్లనైతేనేమి—బిడ్డలను సినిమాలకు వెంటబెట్టుకొని వెళ్ళుట పరిపాటి. పంజరంలోని పక్షి లాగున పసిపాపడు తల్లి ఒళ్ళో బంధింపబడి, గంటలతరబడి కదలక మెదలక, మౌనంగా కూర్చునివుండాలి. ప్రొద్దస్తమానం వాగుతుండే బిడ్డ పెదిమలు కూడ కదపకుండా వుండాలి. బిడ్డబాధ లింతటితో అంతమొందవు; తెరపై వింత వినోదముల గొలుపు కొన్ని దృశ్యాలను బొమ్మలను పసిబిడ్డలు ఏ కొద్దిసేపో ఉత్సాహంతో వీక్షించగలరు. కాని ఏకాగ్రతతో ఎంతోసేపు చూడలేరు. బిడ్డ శ్రద్ధాసక్తులు అత్యంత పరిమితంగలవి. కాన, గంటలకొలది వీక్షించటమంటే సామాన్యమైన విషయంకాదు. ఎంతో బాధాకరమైనది. ఇంతే కాదు. అన్నిటిని మించిన బాధలను కలుగజేయునట్టివి మరెన్నో వున్నాయి. అందులో ముఖ్యంగా కొన్ని సందర్భములలో ప్రదర్శితమగు వికారఘట్టాలు, భయంకరమైన సంఘటనలు, చెవులు చిల్లులుపడుధ్వనులు, వీటివలన పసిపాపడు అనుభవించు భీతి మొదలయిన ఉద్రేకములు, బాధలనుగురించి చెప్పటానికే అశక్యము. బిడ్డకా దృశ్యాలు బూటకములు కావు. కొన్ని ఎంతో యథార్థంగా వుంటాయి; మరికొన్ని అగమ్యగోచరంగా వుంటాయి. అన్ని గంటలకాలం, అన్ని

విధములయిన ఉద్రేకములు, బాధలు అనుభవించుటచేత బిడ్డ కెన్ని విధములగనో హానిసంభవించుట తథ్యము. బిడ్డ ఒంటరిగా వున్నపుడుకాని, నిద్రలోకాని భీతితో కేకలుపెట్టడం ఉలిక్కి పడి లేవటం, కలవరించటం చేస్తుంది. ఇట్టిఉద్రేకముల వలన నాడీసంబంధమైన వ్యాధులతో బిడ్డ నీరసించిపోవుటేగాక మాన సికంగా భీతి భ్రమలకు గుఱిఅవుతాడు. కాని సంగీతం, నృత్యం మున్నగు లలితకళలను కొద్దిసేపుమాత్రం బిడ్డ వీక్షించుట వాని అభివృద్ధికి తోడ్పడుతవి.

ఈ ఈడు బిడ్డ వెలిబుచ్చు స్వతస్సిద్ధమైన మరికొన్ని చేష్టలను తల్లి గ్రహించి వాటి కనుగుణంగా తోడ్పడుట ఆవశ్యకము:—

రెండున్నరనుండి మూడు ఏండ్ల వరకున్న దశలో బిడ్డ తఱచుగా ఒంటరిగా ఆడుకొనుటకు (సమూహాములో ఆడు కోదు) తన పనులను స్వయంగా చేసికొనుటకు వాంఛించు తుంది; ఉదయం ఆహారం పుచ్చుకోగానే సామాన్యంగా బిడ్డ తన ఆటవస్తువులున్నగదిలో లేదా తన ఆటసామానులను మోసుకెళ్ళి ఏదో ఒక మూలనో, అరుగుమీదనో ఒంటరిగా కూర్చుని ఆడుకొంటుంది; ముఖ్యంగా నర్సరీ స్కూళ్ళకు వెళ్ళు అలవాటున్న బిడ్డ తమకని నిర్ణీతమైన ఆటవస్తువులు లేని యెడల బయటికి వెళ్ళిపోతుంది. లేదా నీళ్ళగదికి వెళ్ళి సబ్బుతో నీళ్ళలో ఆడుకొంటుంది. ఇట్టి తరుణమును కనిపెట్టి, తల్లి బిడ్డకు స్నానంచేయించితే బిడ్డ చక్కగా ఆడుకొంటూ ఆనం దంగా స్నానంచేస్తుంది. కాని, బిడ్డయే స్వయంగా సబ్బు పట్టించుకొని తోముకొంటూ నీళ్ళుపోసుకొంటున్నదనుభావం

క్షలుగులాగున తల్లి వర్తించాలి. అదేరీతిగ దుస్తులు తొడుక్కొనుట, తల దువ్వుకొనుట మున్నగు విషయాలలో తల్లి చాకచక్యంతో ప్రవర్తించాలి. ఉదా:- బిడ్డ నీళ్ళుపోసుకొనుట పూర్తి అయిన వెంటనే, తుండుగుడ్డను తీసుకొని తుడుచుకొమ్మని సూచించాలి. బిడ్డను తనగదికి వెళ్ళి, లాగు, చొక్కా తొడుక్కొమ్మని సలహా ఇవ్వాలి. బిడ్డ తనగదికి గబగబ వెళ్ళి దుస్తులను తొడుక్కోటానికి అనేకపర్యాయములు ప్రయత్నిస్తుంది. కాని, చక్కగా తొడుక్కోజాలదు. చివరకు తల్లి సహాయము నపేక్షించుతుంది. లేదా అట్టి సూచన కనబరచినపుడు తల్లి చొక్కా, లాగు తొడుగుకొనుట, గుండీలు పెట్టుకొనుట నేర్పాలి.

ఈ వయస్సు బిడ్డ తఱచుగా తనగదికి వెళ్ళి లేదా మరో చోటనైనాసరే తన ఆటసామానులతో ఒంటరిగా ఆడుకోటానికి ఇష్టపడుతుందని ఇదివరకే అనుకున్నాముకదా! బిడ్డయొక్క ఇట్టి సహజచేష్టలను అవకాశముగ తీసుకొని తల్లి బిడ్డయొక్క సర్వతోముఖాభివృద్ధికి మంచి తెలివితేటలతో తోడ్పడాలి. అనగా, బిడ్డయొక్క అవయవపటుత్వమునకు, నేర్పుకు, జ్ఞానేంద్రియముల వికాసంద్వారా బుద్ధివికాసమును పొందుటకు తోడ్పడునట్టి వస్తుసామగ్రిని, ఆటసామానును బిడ్డగదిలో అమర్చుట అత్యంతావశ్యకమన్నమాట.

1— బిడ్డ తన వస్తువులను తగిలించుటకు అనువుగా (దాని కందుబాటులో వుండునట్లు) ఒక చిలుకకొయ్యా, లేదా చిన్నస్టాండు వుండాలి.

2— ఒక చిన్న బల్లపై అద్దము, దువ్వెన ఉండాలి.

3— గదిగోడలకు ఆకర్షణీయమైన రంగుచిత్రములు బిడ్డ వీక్షించుట కనువుగా క్రిందికి తగిలించివుండాలి. అవి బిడ్డ పలుమారు పరికించునట్టి, పరిచయమున్నట్టి చెట్లు, తీగెలు, పువ్వులు, పక్షులు, జంతువులు మున్నగు ప్రకృతి దృశ్యములుగల చిత్రములై వుండాలి. ముఖ్యంగా తనకు పరిచయమైనవారివి, తన బంధుమిత్రుల, తోటి పిల్లల ఛాయాపటములు వుండుట మంచిది.

4— స్వయంగా ఊపుకొనుట కనుకూలమైన ఊయల అమర్చబడి వుండాలి. కాళ్లు నేలమీద ఊని ఊచుటకు వీలుగా వుండాలి.

5— మరొక చిన్నబల్ల, ఒకటి రెండు చిన్న కుర్చీలు, రంగుల చాపలు వుండాలి. బల్లమీద కొన్ని కాగితాలు లేదా పుస్తకము, వివిధరంగుల క్రేయాన్సు (రంగు పుల్లలు) లేదా పెన్సిలుసు, గోడకానించి నల్లబల్ల, సీమసున్నం, తుడుచుటకు గుడ్డ మున్నగునవి ఒక క్రమము ననుసరించి అమర్చబడాలి.

గోపురము, మెట్లుకట్టుట కుద్దేశింపబడిన రంగుల కొయ్యలు, ముఖ్యంగా మాంటిసోరి విద్యాబోధక సామానులు, వంతెన, రైలు మొదలగువాటిని కట్టుటకు కొయ్య ఇటుకలు, చొక్కా, లాగు, బట్టలను తొడుక్కోటానికి నేర్పును కలుగజేయునట్టి కొన్ని చట్టములు, పెద్ద రంగుపూసలు, లావైనదారము, రబ్బరుబంతి, మున్నగు ఆటవస్తువులను చక్కగా వేర్వేరుగా అమర్చాలి. గది చిమ్ముటకు చిన్న చీపురుకట్ట, బల్ల, కుర్చీ, ఇతరసామానులను తుడుచు

టకు ఒక గుడ్డ ఒకచోట పెట్టివుంచాలి. ముఖ్యంగా ఈ వయస్సు బిడ్డకు ఎరుపురంగు అధిక ఆకర్షణీయమైనది. కాబట్టి, కొన్ని ఆటసామానులు ఎరుపురంగులో వుండటం అవసరము. కాని అన్నీ ఒకే రంగులో వుండకూడదు. వివిధరంగులలో వుండాలి. ముఖ్యంగా ప్రధాన రంగులగు ఎఱుపు, నీలము, పసుపులోను, మిశ్రమరంగులగు ఆకుపచ్చ, ఊదారంగులలోను వుండాలి. కొంత గాఢంగా వుండుట ఉత్తమం.

## 8 - సామాజిక ప్రవర్తన

రెండున్నరనుండి మూడేండ్ల ఈడువరకు బిడ్డలు కొందరు తమ ఇంటివద్దనే ఆడుకోనటాని కిష్టపడతారు. ఇరుగు పొరుగు బిడ్డలతో కొంత ఆడుకొంటారు కాని, ఇంటివద్ద మాత్రమే ఆడుకొంటారు. ఇతరుల ఇండ్లకు, క్రొత్తచోట్లకు వెళ్ళి ఆడుకోటాని కెంత మాత్రము ఇష్టపడరు. మరికొందరు ఇరుగు పొరుగిళ్ళవద్ద కాని మరేచటనైనాసరే క్రొత్త పాత లేకుండాచక్కగా ఆడుకొంటారు. మొదటిరకం బిడ్డలకు క్రొత్త వాళ్ళు, క్రొత్తచోట్లు అంటే తగని బిడియము, భీతి. ఇట్టి సిగ్గు భయాదులను వెలిబుచ్చుబిడ్డలు క్రొత్త పరిసరములకు, క్రొత్త పరిస్థితులకు తగినట్లుగా వర్తించుశక్తి త్వరగా అలవర్చుకొనజాలరు. రెండవరకం పిల్లల ప్రవర్తన భిన్నంగా వుంటుంది. అపరిచితులు, అపరిచితస్థలాలంటే వీరికి, సిగ్గు, భయం వుండవు. అందుచేతనే ఈ రకంబిడ్డలు ఇరుగుపొరుగిళ్ళకు వెళ్ళి ఆడుకోటాని కెంతో ఉల్లాసము, ఉత్సాహము వెలిబుచ్చుతారు. ఇట్టి బిడ్డలు, క్రొత్త పరిసరపరిస్థితుల కనుగుణ్యాంగా ప్రవర్తించుశక్తిని త్వరగా అలవర్చుకొంటారు. ఇట్టి భిన్న

ప్రవర్తనలకు ముఖ్య కారణము, బిడ్డ పెరుగుతున్న కుటుంబ పరిసరపరిస్థితులే అని చెప్పక తప్పదు. కాబట్టి తల్లిదండ్రులు తమ బంధుమిత్రులతో, ఇరుగుపొరుగువారితో కలసి మెలసి వుండుట, విందు వినోదములలో తరచుగా పాల్గొనుట, సంస్కృతి, సహవాసము, సానుభూతి, సహకారములతో గూడిన వాతావరణమును కల్పించుట, మున్నగు విషయములకు గమనమిచ్చుట ఎంతయినా అవసరమన్న మాట. ఇంతమాత్రమే కాదు, తల్లి తన ఈ ఈడుబిడ్డయొక్క చిత్తవృత్తిని పరిశీలించుతూ దాని సామాజిక ప్రవర్తన పెంపొందుట కావశ్యకమైన సుశిక్షణ ఇవ్వాలి. ఎలాగంటే :-

తమ ఇంటివద్ద తప్ప మరెక్కడ కాని ఆడనొల్లని బిడ్డల విషయం మొదట ఆలోచిద్దాము. తల్లి ఇరుగుపొరుగు బిడ్డలను ఇంటికి రప్పించి తన బిడ్డడు ఉల్లాసంగా వారితో కలసి ఆడుకొనునట్టి అవకాశమును కల్పించాలి. దీనితోపాటు, పైపిల్లలతో కలసి క్రొత్తచోట్లకు, ఇతరులఇళ్ళకు, అనగా...పుర ఉద్యానవనములు, బాలక్రీడాస్థలములు, బంధుమిత్రుల, ఇరుగుపొరుగువారి ఇండ్లు మొదలగు చోట్లకు వెళ్ళి ఆడుకొనునట్టి అవకాశములను కల్పించాలి; బిడ తన ఈడువారితో మాత్రమేగాక తనకన్న పెద్దపిల్లలతో—అనగా—నాలుగైదేళ్ళ ఈడువారితో కలసి ఆడుకొనునట్టి సదుపాయములను కల్పించాలి.

ఇంతేకాదు, ఈ బిడ్డకున్న మరొక లక్షణము నెఱుగుట అత్యంతావశ్యకము. ఈబిడ్డ (తన ఇంటివద్ద తప్ప మరెచటకాని

ఆడ నొల్లని బిడ్డ) సామాన్యంగా, తన ఆటసామగ్రితో ఇతర బిడ్డలను ఆడుకోనివ్వడు; తనకత్యంతప్రియమైన క్రొత్తపిడతలు, బొమ్మలను అసలే తాకనివ్వడు. ఇట్టి లక్షణమును గుర్తించి తల్లి ఇరుగుపొరుగుబిడ్డలు రాకముందే తనబిడ్డకిష్టమైన ఆటవస్తువులను కొంతకాలంమాత్రం దాచివుంచాలి. ఆవిధంగా చేసినచో, బిడ్డతనకంతఇష్టంలేనిఆటసామగ్రితో ఇతరబిడ్డలతో ఆడుటకు అంగీకరించుతుంది; తనుకూడవారితో కలసికొంతసేపుఆడుకొంటుంది; అటుపిదప తన కత్యంత మక్కువగల క్రొత్త పిడతలను, బొమ్మలను తన చెలికాండ్రకు చూపెట్టాలన్న అతిశయ భావంచేత తీసుకువచ్చి చూపెడుతుంది; క్రమేణ వారితో కలసి క్రొత్తవాటితో ఆడుకొనుటకు అలవడుతుంది. ఏ కారణం చేతనైనా తన బిడ్డడు తన కత్యంత ప్రియమైన ఆటవస్తువులను అసలే చూపించకపోయినచో వాటెని చూపెట్టులాగున తల్లి అత్యంత చాకచక్యంతో సూచించాలి. ముఖ్యంగా ఇట్టి బిడ్డలను నర్సరీస్కూళ్ళకు పంపుట అత్యుత్తమము. అచట పరిసర పరిస్థితులు, సుశిక్షణ ఫలితంగా ఈ బిడ్డకున్న బిడియము, భీతి సన్నగిల్లుతవి; అప్పుడప్పుడే తలచూపుతున్న అహంభావం, అతిశయం మొక్కలోనే నశించిపోతవి; కష్టనిష్ఠురముల నెదుర్కొంటూ, సహజమార్గమున తన వ్యక్తిత్వమును స్థిరపరుచుకొంటుంది. వీటితోపాటు నలుగురితో కలసిమెలసి ఆడుకోటం, అన్యోన్యానురాగం, సహవాసం మున్నగునవి పట్టుపడుటే గాక క్రొత్తపరిస్థితులకనుగుణ్యంగా ప్రవర్తించుటను అలవర్చుకొనుటకు అవకాశ మేర్పడుతుంది. అనగా సంఘజీవనమునకు పునాది ఏర్పడుతుందన్నమాట.

ఇక రెండవరకం బిడ్డలనుగురించి ఆలోచిద్దాము:— వీరు ఇంటివద్ద ఆడుకోటాని కిష్టపడరు; ఇరుగుపొరుగిళ్ళకు, క్రొత్తచోట్లకు వెళ్ళి ఆడుకుంటారు; ప్రొద్దస్తమానం బయట కెళ్ళి, ఎక్కడో ఒకచోట ఆడుకోటాని కిష్టపడతారు. ఇట్టి బిడ్డలు క్రొత్తపరిసరములకు, పరిస్థితులకు అనుగుణ్యంగా వర్తించుటను త్వరగా అలవర్చుకొంటారు. కాని కుటుంబజీవనము, బంధుజనప్రేమ పెంపొందించునట్టి అవకాశములను వీరికి కల్పించుట ఆవశ్యకము. తల్లి ఈ లక్షణములుగల తనబిడ్డకు ఇంటి వద్ద సయితము, ఇతరపిల్లలతోపాటు, తన అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రతో కలిసి ఆడుకొనునట్టి పరిస్థితులను, అనగా అత్యంతాకర్షణీయమైన పరిస్థితులనుకల్పించాలి. ఉదా:–బిడ్డలు పాల్గొనునట్టి విందువినోదములు, తన బిడ్డయొక్క జన్మదినోత్సవము, బొమ్మలకొలువు, ఆటపాటలు మున్నగునవి అన్న మాట. ఇంట్లో తన తల్లికి, తండ్రికి, తక్కిన బంధుజనులకు చిన్న చిన్న పనులుచేస్తూ తోడ్పడుట మొదలైనవాటికి అవకాశములు కల్పించాలి. ఈవిధంగా తల్లి తెలివితేటలతో ఈ రకం బిడ్డకు తోడ్పడినచో, తన బిడ్డ ఇంటాబయటా ఆ యా పరిస్థితులకనువగు ప్రవర్తన నలవర్చుకొంటూ కుటుంబజీవనమునకూ, సంఘజీవనమునకు సిద్ధపడుతుంది.

సాధారణంగా ఈ ఈడు బిడ్డలు (2 నుండి 3 ఏండ్ల దాక) తమ తల్లిదండ్రులలో ఎవరినో ఒకరిని మాత్రమే అధికంగా ప్రేమించునట్లు గోచరించుతుంది; తల్లినా, తండ్రినా అను విషయంలో ఒక్కొక్కరొక్కొక్కవిధంగా వుంటారు; ఒకప్పుడొకరనీ మరొకప్పుడు ఇంకొకరినీ ఎక్కువగా ప్రేమిం

చుటకలదు; కాని పై రెండు లక్షణములు తాత్కాలికమే. పగలు ఒకరినీ, రాత్రి మరొకరినీ, లేదా, కొన్ని గంటలకాలం తల్లియందు, కొన్ని గంటలసేపు తండ్రియందు అధికానురాగం వెలిబుచ్చుట కలదు. మరుసటిరోజు, లేదా, కొంతసేపటికే వారిలో మరొకవిధంగా మార్పుకలుగుట పరిపాటి. అనగా, ఈ వయస్సు బిడ్డకు ఈ విషయంలో కూడా స్థిరత్వము ఏర్పడక డోలాయమానసము గోచరించుతుంది. అయితే, ఆపూట ఎవరిని ఎక్కువగా ప్రేమిస్తుందో వారి యందు బిడ్డకు గురుత్వం ఏర్పడి, వారిసలహా సహాయములను పొందుటకు ఇష్టపడుతుంది. శాత్రులందు మూత్రవిసర్జనవిష యంలో కాని, తనకు నిద్రవచ్చినపుడుకాని తఱచుగా తల్లి తన చెంత వుండి సహాయపడాలని కోరుతుంది. కాని, ఒక్కొక్క సమయంలో తండ్రికావాలని పట్టుబట్టుతుంది. ఈ విషయమును గురించి మనశ్శాస్త్రజ్ఞులలో వివిధాభిప్రాయములు బయలు దేరినవి. ముఖ్యమైన కొన్నిటిని మాత్రం సంక్షిప్తంగా తెలిసి కొనుట మంచిదనుకొంటాను.

తల్లిదండ్రులు పిల్లలమధ్య పరస్పరప్రేమ లింగభేద మును బట్టి పెంపొందునని కొందరు శిశుమనస్తత్వవేత్తల అభిప్రాయము. మరి కొందరు శిశుమనశ్శాస్త్రజ్ఞులు పై అభిప్రా యమును ఖండించుతూ, బిడ్డ పుట్టిపెరుగునట్టి పరిసరపరిస్థితుల ప్రభావ ఫలితముగ, అనురాగవిషయంలో లింగభేదము కొందరు బిడ్డల విషయంలో కొంత కనిపించిననూ, అది అస్వా భావికమనీ, అందరికీ ఈ సిద్ధాంతం అన్వయించదనీ ఉద్ఘాటించి నారు. కొంత స్థూలంగా పరిశీలిద్దాము:— శిశువు జన్మించి

వప్పటినుండి ఆరు ఏండ్ల ఈడువరకు సామాన్యంగా, ఆడుబిడ్డ తన తండ్రినీ, మొగబిడ్డ తల్లినీ అధికంగా ప్రేమిస్తారనీ, ఇది సహజగుణమనీ, వీటికి సంబంధించిన మరెన్నో విషయములను, కొందరు శిశుమనస్తత్వవేత్తలుసిద్ధాంతీకరించియున్నారు.

ఇట్టి సిద్ధాంతం పొరపాటు. బిడ్డచుట్టునున్న సన్నివేశ సందర్భములు సరియైనవి కానప్పుడే ఇట్టి విచిత్రగుణం (అస్వాభావికమై పెడదారిబట్టిన చిత్తవృత్తి) తాత్కాలికంగా కొందరు బిడ్డలయందుమాత్రమే గోచరించవచ్చుననీ, అందరు బిడ్డలయందు ఇట్టి చిత్తవృత్తి ఉండదనీ ఉద్ఘాటించారు—తండ్రి ఉదయంనుండి సాయంకాలంవరకు ఇంటివద్ద వుండడు; తన వ్యవహారములను ముగించుకొని సాయంకాలం తండ్రి ఇంటికిరాగానే బిడ్డను (ఆడ మొగ వివక్షత లేకుండ) చేరదీసి, వాహ్యాళికో, వింత వినోదములను తిలకించుటకో తీసుకుపోతాడు; లేదా బిడ్డతో ఆడుకుంటాడు. సాధారణంగా తల్లి తన గృహకృత్యాలలో మునిగిపోయివుంటుంది. ఇంతే కాదు. ఉదయంనుండి తండ్రిని చూడకపోవుటచే అతనియందు కొంత క్రొత్తదనం బిడ్డకు కనిపించుతుంది. ఇట్లే మరెన్నో కారణములచేత బిడ్డ తండ్రిచెంత వున్నకాలంలో అధికంగా ప్రేమ వెలిబుచ్చుతుంది. కాని, ఇట్టివాటికి వ్యతిరేక పరిస్థితులలో—అనగా—వ్యవహారప్రపంచమున పనిచేసి, అలసివచ్చుటచేతనో, లేక కష్టనిష్ఠురములవలన ఏర్పడిన హృదయవేదన వల్లనో తండ్రి ఇంటికివచ్చినపుడు విసుకు, చీకాకు చూపించవచ్చు. అట్టి సందర్భములలో బిడ్డ తండ్రితో అహ్లాదంగా, స్వేచ్ఛగా ఆడుకోక, భయపడవచ్చును. తల్లి

తన్ను అనుక్షణం ఆదరించుతూ అనురాగం చూపెట్టుటచేత ఆమెను ఎక్కువగా ప్రేమించవచ్చు. లేదా కుటుంబంలో దారిద్ర్యం మున్నగు బాధలవల్ల తల్లి తన సహజ సహనశక్తిని తాత్కాలికంగా కోల్పోయి చీదరించుకొన్నచో తాత్కాలికంగా బిడ్డ తల్లినిచూచి భయపడవచ్చు. లేదా, కొన్ని కుటుంబాలలో వున్న అజ్ఞానం, ఐశ్వర్యమదాంధత, స్త్రీలయందు నైచ్యభావము, పురుషులయందు ఉత్కృష్టభావము మున్నగు వాటితో గూడిన వాతావరణములో పెరుగునట్టి బిడ్డలు మగ, ఆడ వివక్షతలేక తల్లిని ఏవగించుకోటం, తండ్రిని పూజ్యభావంతో ప్రేమించటం తటస్థింపవచ్చును. కుటుంబపోషణకు సరిపోవునంత ద్రవ్య ఆధారముండి (ఉద్యోగం లేక ఏదో ఒక వృత్తివలన సంపాదించుకొను అవకాశము) చక్కని సంస్కృతి అనగా, విద్య విజ్ఞానాలు, సంగీత సాహిత్యాలు, పరస్పర ప్రేమ, సత్సహవాసము, సానుభూతి మొదలగుపరిస్థితుల వాతావరణములమధ్య పెరుగునట్టి బిడ్డలలో సహజమైన అనురాగము, సత్ప్రవర్తన మొదలగునవి నిరాటంకంగా అభివృద్ధి చెందుతవి. అష్టయిశ్వర్యమున్నప్పటికీ సంస్కృతికీ, అన్యోన్యానురాగములకును తావులేని కుటుంబములలో పెరుగు బిడ్డలలో అస్వాభావికమైన వాంఛలు, అవకతవకలుగానుండు అనురాగము, మానసికవ్యాధులు మున్నగునవి గోచరించును. అసలే అన్నానికి మలమల మాడిపోతూ, అష్టదరిద్రము ననుభవించుచున్న కుటుంబములో పుట్టి పెరుగు బిడ్డలకు మరెన్నోవిధములైన అస్వాభావిక వాంఛలు, దైహిక, మానసిక వ్యాధులు సంక్రమించవచ్చును. కాబట్టి ఇట్టి విచిత్రమైన— అనగా—అస్వాభావికమైన ప్రవర్తనలు జన్మలోపుట్టిన సహజ

గుణములనుటకన్న, బిడ్డ పెరుగు పరిసరపరిస్థితుల ఫలితముగ పెడదారిబట్టిన ప్రవర్తనలనుట సమంజసము. అనేక సుగుణ దుర్గుణములకు, సత్ప్రవర్తన. దుష్ప్రవర్తనలకు, సక్రమచిత్త ప్రవృత్తులకూ, పెడదారినిబట్టిన చిత్తప్రవృత్తులకూ వివిధ మానసిక రోగములకూ బిడ్డ పుట్టి పెరుగుతుండే సమాజ, కుటుంబములయొక్క పరిసరపరిస్థితులే మూలకారణమనీ, సామాజిక ప్రవర్తన అనేది బిడ్డకు ఆరేండ్లు నిండునప్పటికే చాలవరకు పట్టుబడిపోతుందనీ మదికొందరు మనస్తత్వవేత్తలు అనేక ఏండ్లపర్యంతము బహువిధములుగ పరిశోధించి సిద్ధాంతీకరించియున్నారు.

ఇందువలన తేలినదేమంటే, బిడ్డ సంఘజీవి. ఆడ, మొగ అను వివక్షతలేక సక్రమమార్గమున సర్వతోముఖాభివృద్ధి చెందుటకు అనువగు సంఘ కుటుంబ పరిసరపరిస్థితులు—అనగా, ఒక వైపున అష్టైశ్వర్యము, మరొక చెంప అష్టదరిద్రమునకూ, ఉత్కృష్టత నైచ్యభావములకూ, అవిద్య, అజ్ఞానములకూ తావు లేనట్టివియు, సమస్త ప్రజలకు జీవితపోషణకు విద్య విజ్ఞానములకు సదవకాశములూ, బంధు మిత్ర ప్రేమ, సత్సహవాసము, సానుభూతి, సహకారములు విరాజిల్లునట్టి సమాజ, కుటుంబ పరిసర పరిస్థితులు ఆవశ్యకము అని వీరి సిద్ధాంతము. అట్టి పరిస్థితులు ప్రస్తుతం అందరికీ అందుబాటులో లేవు; నిజమే. కాని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, ఇట్టి పరోత్కృష్ట, శాస్త్రీయసిద్ధాతములను, అనుభవజ్ఞానమునూ తెలిసికొని తమకు సాధ్యమైనంతవరకు తమ బిడ్డల సక్రమ వికాసమునకు కృషిసల్పుట అత్యంతావశ్యకము కదా!

